రంజన్ ఆభరణములు వెండితో తయారుచేసి అందమైన
రాళ్లు కట్టుడముచేసి బంగారు మలామా యిచ్చినవి.

**3 సం॥ గ్యారంటీ**

నెక్లెసు రు. **30-0-0**

**RANJAN**
TRADE MARK
PRODUCTS
MOST
FASHIONABLE
JEWELLERY.
NECKLACES IN MOST
CHARMING AND
ATTRACTIVE
DESIGNS.



55 56

PAIR Rs. 4-12-0

**RANJAN**
TRADE MARK



364 57

PAIR Rs. 4-12-0

వస్తువులు తెప్పించువారికి పార్శిలు చార్జీ రు. 1-6-0.

ఉమాగోల్డు కవరింగు వర్క్సు, ఉమామహల్-మచిలీపట్టణము

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సంపుటము 45
సంచిక 6
**1.10-52**

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

నందన ఆశ్వయుజ శుద్ధ చతుర్దశి బుధవారము




## తల్లి యశోధర—బిడ్డ రాహులుడు.

శాంత గంభీర తేజస్వి శాక్యమౌని
నిర్వికారత ముంగిట నిలువ జూచి



సాశ్రు నయన యశోధరా సాధ్వి వచ్చి
సుతునిచేతనె వేయించె పతికి భిక్ష.

# పిన్నలకు ఒకమాట

ఈ విజయదశమికి ప్రత్యేకంగా మీకోసమే యీసంచికను వినియోగించగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

మా పత్రికలో "బొమ్మరిల్లు" భాగంలో పడే రచనలు చదివినప్పుడు మీలో చాలమందికి 'మనమూ ఇలాంటి వెందుకు రాయగూడదూ' అనిపించివుంటుంది. అంతే కాదు—

'ఇంతకంటె బాగా రాస్తాం' అనుకునికూడా వుండవచ్చు. మీలో కొంతమందికి 'మనం రాసిన దాన్ని వేసుకోరేమో' అని నిరుత్సాహం కలిగి రాసినదాన్ని మీ వద్దనే అట్టే పెట్టుకోటమో, లేక అసలు రాయకనేపోవటమో చేసి ఉంటారు. అటువంటివారికి కథల్లోనో, పాటల్లోనో, పద్యాల్లోనో, బొమ్మల్లోనో ఊహాలు వెల్లడించుకునే ఉత్సాహం కలిగిద్దామని ఈ దసరా సంచికను తలపెట్టాం.

నేటి పెద్దలందరూ నిన్నటి పిల్లలే; అలాగే నేటి పిల్లలందరూ రేపటి పెద్దలు. పెద్దవాళ్లకి లాగానే పిల్లలకు కూడా ఏదో రాయాలని, ఏదో చెప్పాలని సహజంగా అభిలాష ఉంటుంది. రేపు తమ స్థానం ఆక్రమించబోయే ఈ పిల్లలు ఏం చెబుతారో వినడం పెద్దవాళ్ల విధి. రేపు గొప్ప గొప్ప రచయితలు అనిపించుకోబోయే వారందరూ ఈనాటి బాల రచయితల్లోంచే రావాలి గదా!...

ఈ సంచికలో రచనలు పెద్దవాళ్లు రాసినవి, చిన్నవాళ్లు రాసినవి కూడా ఉన్నాయి. పెద్దలు, చిన్నలు ఒకరి నొకరు అర్థంచేసుకోవటానికి ఈ రచనలు ఉపయోగపడితే చాలా సంతోషిస్తాము.

మా ప్రయత్నానికి ముఖ్యంగా బాలరచయితలు, పాఠకులు ఇచ్చిన సహకారానికి ఎంతో కృతజ్ఞులం. కొందరు కథలు, కొందరు గేయాలు, కొందరు బొమ్మలు పంపారు. వాటిలో కొన్నిటిని ఏరి ప్రకటించాం. వచ్చివాటి నన్నిటినీ ప్రకటించటం సాధ్యం కాదు గదా? కొన్నిటిని తరవాత వచ్చే మామూలు సంచికలలో ప్రకటిస్తా ఉంటాం. ఈసంచికలో రచనలన్నీ పిల్లలు రాసినవే అయితే బావుండునని మీకు కూడా అనిపించిఉండవచ్చు. మీవద్దనుంచి ఇంత సహకారం వస్తుందని తెలిస్తే అలాగే చేసి వుండేవాళ్లం. వచ్చేసారినుంచీ పిల్లలసంచికలను పిల్లల రచనలతోనూ, బొమ్మలతోనూ మాత్రమే నింపి మీకు ఇంతకంటే ఎక్కువ ఆనందం కలిగించాలని అనుకుంటున్నాం. మీరు కూడా మీ దైనిక జీవితంలో వచ్చే రకరకాల అనుభవాలమీద రకరకాల కథలు, వ్యాసాలు, పాటలు, పద్యాలు, బొమ్మలు పంపి సహకరిస్తారని ఆశిస్తున్నాం.

మీలో ముగ్గురికి బహుమతులు వచ్చాయి. అయితే మిగతా వారంతా చేతకాని వాళ్లనీ, బహుమతులు వచ్చినవాళ్లు చాలా గొప్పవాళ్లనీ అనుకోవద్దు. ఎవరికి తెలుసు? ఇంకోసారి ఆ బహుమతులు ఎవరికి వస్తాయో? ప్రస్తుతానికి మాత్రం బహుమతులు పొందిన వాళ్లని మాతోపాటు మీరుకూడా అభినందించండి. త్వరలో ఆ ముగ్గురు మిత్రుల ఫొటోలు, ఎడ్రెసులు ప్రకటిస్తాం. వారికి మరిచిపోకుండా అభినందన లేఖలు రాస్తారు కదూ.

## బహుమతులు

(1) కథా బహుమతి :— "పిల్లి శకునం" అనేకథ (8 వ పేజీ) రాసిన పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రికి. (15 సం॥)

(2) గేయ బహుమతి :— "పాప - నక్షత్రం" అనే గేయం (7 వ పేజీ) రాసిన పి. పాండురంగవిఠల్‌కు. (13 సం॥)

(3) చిత్రలేఖనబహుమతి :... "నాబొమ్మ" (9 వ పేజీ) వేసిన సి హెచ్. సిరిదేవికి. (3 సం॥)

## గమనిక.

ఇది పిల్లల ప్రత్యేకసంచిక గనుక 'రెండు మహానగరాలు' 'పరారీ' 'విజ్ఞానశిఖలు', ప్రశ్నలు - సమాధానాలు, రాజకీయాలు ఈ సంచికలో ప్రచురింపబడటం లేదు. పై వారం నుంచి యథాప్రకారం అవి ప్రకటించబడతాయి. —సంపాదకుడు.

# దసరా పండుగ అంటే ఏమిటి

"దశ" అంటే పది. దశరాత్రులు పూజలు చేసేటటువంటి పండుగ ఇది. అందుకనే దీనిని "దశరాత్రు"ల పండుగ అన్నారు. దీనినే చాలామంది "దస్ రాత్" అని పిలుస్తూ ఉండడంచేత "దసరా" అనే మాట కొన్నాళ్ళకు ఖాయమైపోయింది. ఎట్లాగంటే, "సూర్యనారాయణ" అనే పేరు ఎవరికైనా ఉన్నదనుకోండి. ఆ పేరును పూర్తిగా పలుకలేక "సూర్యం" "సూర్యం" అంటాము. ఆఖరుకు "సూరి", "సూరి" అని కూడా అంటాం. "విశ్వనాథం" అనే పేరు ఒక పిల్లవాడికి ఉన్నదనుకోండి, ఆఖరుకు వానిపేరు "విస్సన్న" అవుతుంది. నీపేరు ఏమిట్రా అని అడిగితే "నాపేరు విస్సన్న" అంటాడు. ఏమైతేనేమి! విస్సన్న చెప్పింది వేదం అన్నట్లుగా, "పదుగురాడు మాట పాడియై ధర జెల్లు"-కనుక లోకంలో పదిమందీ అనేటటువంటి మాటనే మనం కూడా ఉపయోగిద్దాం. కనుక 10 రాత్రులు పూజలు జరిగేటటువంటి యీ పండుగను "దసరా" అని పిలుస్తున్నాము. కాని, ఈ పది రాత్రులలోనూ మొదటి తొమ్మిది రాత్రులయందు జరిగేటటువంటి పూజ ఎక్కువ ముఖ్యమైనది. ఈ తొమ్మిది రాత్రులయందున్నూ లోకానికి తల్లి వంటిదగు లోకమాతయైన "దేవిని" పూజ చేస్తారు. "దేవి" అంటే పార్వతీదేవి కాదు, లక్ష్మీదేవి కాదు, సరస్వతీదేవి కాదు. ఈ మూడు దేవతలను పుట్టించినటువంటి మహాదేవి ఇంకొకటి ఉంది. దానినే "ఆదిశక్తి" అంటారు. లక్ష్మీదేవి, సరస్వతీదేవి, పార్వతీదేవి అనేటటువంటి ముగ్గురు అమ్మలను కన్నటువంటి పెద్దమ్మ ఇంకొకటి ఉంది. ఈ ఆదిశక్తి ఎటువంటిదయ్యా అంటే "అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ". ఈ ఆదిశక్తి ఒకటి ఉన్నదనిన్నీ, ఈ మహాదేవియే జగత్తు అంతటికీ ఆధారంగా ఉన్నదనిన్నీ, తపస్సు చేసిన యోగీశ్వరులు గ్రహించారు.

ఈ జగత్తులో అనేక శక్తులు పైకి కన్పిస్తున్నాయి. వేడి, వెల్తురు అనేవి శక్తులే. విద్యుచ్ఛక్తి కూడా శక్తియొక్క స్వరూపమే. అటంబాంబులలో ఉండే అణుశక్తికూడా శక్తియొక్క ఒకానొక స్వరూపమే. రేడియో శక్తికూడా ఒకశక్తియే. మనదేహబలం, బుద్ధిబలం కూడా గొప్పశక్తులే. దేహబలంకంటె కూడా, అనేక విద్యలు నేర్చుకొని, జ్ఞానం సంపాదిస్తే అనేక యంత్రాలు, మంత్రాలు కనిపెట్టి చాలా బలవంతులము కావచ్చు – బుద్ధిబలం అనేది గొప్ప శక్తి – దేహబలానికి బుద్ధిబలానికి ఈ రెండింటికీ మించినది ఆత్మబలం – యోగశక్తివల్ల అనేక అద్భుతమైన పనులు చేయవచ్చు. ఆత్మబలం పూర్తిగా సంపాదించిన వానికి భగవంతుడు ప్రత్యక్షంగా కన్పిస్తాడు. అంటేఏమిటి? జగత్తు అంతటిలోను నిండి ఉన్నటువంటి బ్రహ్మాండమైన ఆదిశక్తి ఎటువంటిదో అర్థం అవుతుంది–కనుక ఈ ఆదిశక్తియొక్క గొప్పతనము ఏమిటో మనం తెల్సుకోవాలి. ఈ దేవియొక్క అద్భుతమైన చరిత్ర ఎటువంటిదో దేవిని గురించి చెప్పబడిన అనేక విచిత్రవిశేష



వినాయకుడు (ఎస్. కోటి—మందసా)

ములయొక్క అర్థం ఏమిటో, పండితులైన వారి మూలంగా తెలుసుకోవాలి - దేవిని గూర్చిన పురాణం ఒకటి ప్రత్యేకంగా ఉంది. దానినే "దేవీ భాగవతం" అంటారు. దీనిని తెనుగువచనంలో కూడా వ్రాసియున్నారు. ఈ పురాణంలో ఉండే కథలలో మనకు జ్ఞానం కలుగజేసే నీతులు చాలా ఉన్నాయి. మనలో ఉండేటటువంటి దురాశగాని, కోపంగాని, గర్వంగాని పూర్తిగా నాశనం అయితేనేగాని, మనం బాగుపడం. లోకంకూడా బాగుపడదు. కనుక యిటువంటి రాక్షసపు గుణాలను మనము అణచి వేసుకోవాలంటే, దేవియొక్క లక్షణములను గూర్చి ధ్యానంచేసి ఆ దేవియొక్క పుణ్యకథలను చదివి, నిత్యమూ పారాయణచేసి, ఆదేవిని మనస్సులో తల్చుకుంటూ పూజచెయ్యాలి. మునీశ్వరులూ, యోగులూ, ఆదేవిని ఎల్లప్పుడూ పూజచేస్తూ ఆరాధిస్తూ ఉంటారు. కాని మిగిలిన జనులు యీ దసరా పండుగ రోజులలో, మొదటి 9 రాత్రులయినా తప్పక పూజ చెయ్యాలి. అందుచేత యీరాత్రులను దేవీ నవరాత్రులని కూడా అంటారు. నవ అంటే తొమ్మిది అని అర్థం. ఈ పండుగ ఆశ్వయుజమాసంలో మొదటి 15 దినాలలో వెన్నెలరాత్రులలో వస్తుంది. ఆశ్వయుజమాసం, కార్తీకమాసం కలిసి శరదృతువు అంటారు. అందుచేత యీ నవరాత్రులను "శరన్నవరాత్రులు" అని కూడా అంటారు.

దేవీ నవరాత్రులు అంటే పగటిపూట పూజచేయరు అని అర్థంకాదు. రాత్రివేళ కూడా పూజచేస్తారు. పురాణంలో దేవియొక్క అవతారములు తొమ్మిదిఉన్నాయి. ఈ నవరాత్రులలోను (9 రోజులలోను) ఒక్కొక్కరోజున ఒక్కొక్క అవతారమును గూర్చి ధ్యానంచేసి పూజచేస్తారు. ఈ తొమ్మిది అవతారములు ఏవనగా:—

(1) మహాకాళి, (2) మహాలక్ష్మి, (3) సరస్వతి, (4) యోగమాయ, (5) రక్తదంతిని, (6) శాకాంబ, (7) దుర్గ, (8) మాతంగి, (9) లభ్రమారి.

దేవియొక్క ఈ 9 అవతారములలో మొదటి 4 అవతారములున్నూ చాలా ప్రసిద్ధమైనవి. మిగిలిన 5 అవతారముల గురించిన కథలు ఎక్కువగా ప్రజలకు తెలిసినవికావు.

దేవియొక్క మొదటి అవతారమైన "మహాకాళి"యొక్క కథ యీ క్రింది విధంగా ఉంది. మొట్టమొదట సృష్టి ఆరంభంలో యీ ప్రపంచం అంతా నీళ్ళతో నిండి ఉంది. పొడి నేల అనేది ఎక్కడా లేదు. అప్పుడు విష్ణుమూర్తి నిద్రపోతూ ఉన్నాడు. ఆయన నిద్రపోతున్న సమయంలో మధువు, కైటభుడు అనే యిద్దరు రాక్షసులు ఆయనయొక్క రెండు చెవులలోనుంచి పుట్టిరి. ఈ మధుకైటభులనే రాక్షసులు సరాసరి సృష్టికర్తయైన బ్రహ్మదేవునిమీదకు దండెత్తి వెళ్ళారు. బ్రహ్మను చాలా బాధలు పెడుతున్నారు. విష్ణుమూర్తి నిద్రపోతూ ఉంటే ఆయనను నిద్రలేపవలసినదని "మహామాయ"ను బ్రహ్మదేవుడు ప్రార్థించాడు.

అప్పుడు మహామాయ వెళ్ళి విష్ణుమూర్తిని నిద్రలేపింది. మధుకైటభులతో యుద్ధం చేయవలసినదిగా విష్ణుమూర్తిని ప్రేరేపించింది. మధుకైటభులతో విష్ణుమూర్తి అయిదువేల సంవత్సరాలు యుద్ధం చేశాడు. కాని, ఆ రాక్షసులిద్దరూ చావలేదు. విష్ణుమూర్తి తమతో చాలా బాగా యుద్ధం చేసినాడని ఆ రాక్షసులు మెచ్చుకొన్నారు. ఆ రాక్షసులలో గర్వం ప్రవేశించింది. వారిలో మాయాదేవి ప్రవేశించి వారిని మరింత గర్వపోతులను చేసింది. "విష్ణుమూర్తీ! నీబలానికి చాలా సంతోషించాము. నీకు బహుమానంగా ఏమి వరము యిమ్మంటావు?" అని ఆరాక్షసులు విష్ణుమూర్తితో అన్నారు. ఆ విధంగా వాళ్ళచేత పలికించినది ఎవరు? మాయాదేవియే పలికించింది. విష్ణుమూర్తి యిదే సమయం అనుకొని, ఒక్కటే పెద్దవరం అడిగాడు. "మీరిద్దరూ నాచేతిలో చచ్చిపోవాలి. ఇదే నాకోరిక" అని విష్ణుమూర్తి అన్నాడు. ఆ రాక్షసులు తాముచేసిన వాగ్దానం ప్రకారంగా అందుకు ఒప్పుకొన్నారు. కాని, "నీళ్లు లేకుండా ఉన్న ప్రదేశంలో మా యిద్దరిని నీవు చంపవచ్చును అని" ఆ రాక్షసులు అన్నారు. ఆ యుగంలో ప్రపంచం అంతా జలమయంగా ఉంది. నీళ్ళులేని ప్రదేశం లేదు. విష్ణుమూర్తికూడా నీళ్లలో నడుమువరకు మునిగి నిల్చున్నాడు. అందువల్ల విష్ణుమూర్తి ఆ రాక్షసులను తన నడుముపైకి ఎత్తి, నీళ్ళమీద ఆ రాక్షసులు లేకుండాచేసి వెంటనే సంహరించాడు. ఈ యిద్దరు రాక్షసుల సంహారం మహామాయయొక్క సహాయంవల్లనే విష్ణుమూర్తి చేయగలిగినాడు. ఈ "మహామాయ" అనేది దేవియొక్క మొదటి అవతారం. ఈమెను కాలరూపిణి అన్నారు. "కాలం" అనేది ఒక మహోద్భుతమైన శక్తిగా మనం అంగీకరించాలి. కాలస్వరూపం అంటే నల్లని ఆకారం గలది అని కూడా అర్థం చెప్పవచ్చు. ఈ మహామాయకు, "మహాకాళి" అనే పేరుకూడా ఉంది. ఈమెకు 10 తలలు, 10 పాదాలు ఉంటాయట. కాని చేతులు 20 ఉంటాయట. ఈవిధంగా మహాకాళిని పురాణాలలో వర్ణించారు.

దేవియొక్క "మహాలక్ష్మి" అవతారం రెండవది. ఇదికూడా చాలా గొప్ప అవతారం. ఈ మహాలక్ష్మి అవతారమునే మహిషాసురమర్దని అని కూడా అంటారు. ఒకానొక యుగంలో ఒక రాక్షసుడు అనగా లోకాన్ని పీడించే దుర్మార్గుడు

# విజయదశమి



శ్రీ కన్నెకంటి
వీరభద్రాచార్యులు

మేలి పలుకుల దీవనలతో
పూల బుక్కాయీల జల్లుచు
బాల బాలిక లోలలాడెడి
పండు విదియ గదా?
జిలుగుమేల్మి పసిండి వన్నెల
గులుకు తంగెడు పూలకోటల
నిలిపి మహిళామణులు గౌరిని
దలచు పర్వమురా!
సొగసు 'నిగ' 'నిగ' లును
"ధగద్ధగ"
లెగయగా హనుమత్పతాకలు
గగనమున కెగురాడగల శుభ
కాల మిదియేరా!
గద్దియలపై కెక్కి జగముల
గన్నతల్లి భవాని పిన్నల
పెద్దలను దీవించి వరముల
పేర్చు సమయమురా!
'పాలువేట' మహోత్సవమ్ముల
భేరి భాంకారమ్ము దిక్కుల
మారు మ్రోగుచు నుండు
'విజయ' విహార తరుణమురా!
విజయ దశమీ జ్యోతులవిగో
వీధి వీధుల వెలుగుచున్నవి
విజయసంపదనంద "ఆంధ్ర
ధ్వజము" నెత్తుమురా!

# ★ దసరాపండుగ అంటే ఏమిటి ★

పుట్టినాడు. వాని శరీరంలోని సగంభాగం మనుష్యాకారంగా ఉంటుంది. మిగిలిన సగంభాగం దున్నపోతు ఆకారంగా ఉంటుంది. దేవతలను బాధలు పెట్టి పీడిస్తున్నాడు. బ్రహ్మదేవుడువెళ్ళి శివునితోను విష్ణుమూర్తితోను - యీ సంగతి తెలియజేశాడు. శివునకు, విష్ణుమూర్తికి బ్రహ్మాండమైన కోపంవచ్చింది. ఆ కోపం మంట మండినట్లయింది. ఆ మంటలోనుంచి దేవి అంటే ఒక మహాశక్తి పుట్టింది. ఈదేవి పేరు మహాలక్ష్మి. ఆమె ఆ దున్నపోతు రాక్షసితో (మహిషాసురునితో) ఘోరమైన యుద్ధము 9 రోజులు చేసింది. ఆ రాక్షసిని పదోరోజున సంహారించినది. మహిషాసురుణ్ని మర్దించినందువల్ల యీమెకు మహిషాసురమర్దని అనే పేరు కూడా వచ్చింది. విచ్చలవిడిగా ప్రవహించి దేశాన్నీ ప్రజలనూ వరదలతో ముంచివేసేటటువంటి భయంకరమైన నదీ ప్రవాహానికి, ఆనకట్ట కట్టి, అక్కడ నీరును నిల్వచేసి, పైనుండి క్రిందకు విరుచుకొని పడే ప్రవాహవేగ శక్తిని కూడా బంధించి విద్యుచ్ఛక్తి (ఎలెక్ట్రిక్కు కరెంటు) తయారుచేసి, ఆ ఎలెక్ట్రిసిటీవల్లనూ, కాలువలగుండా ప్రవహించే నీటివల్లనూ మైసూరురాజ్యంలో పంటలు వృద్ధిచేశారు. అనేక ఫ్యాక్టరీలు ఎలెక్ట్రిక్కరెంటుతో నడిపించి ఇనుపసామాన్లు మొదలైన అనేక సామాన్లు ఆ ఫ్యాక్టరీలలో తయారు చేస్తున్నారు. దేశంలో వర్తకం ఎక్కువైంది. అదే అయిశ్వరం. లక్ష్మి అంటే అయిశ్వర్యమే. విచ్చలవిడిగా దున్నపోతువలె యీ ప్రపంచంలో అనేక నదులు ఉన్నాయి. వాటియందు ఉన్నశక్తి వ్యర్థం కాకుండా చేయగల్గిన శక్తి ఏదైతేఉందో అదే మహాలక్ష్మి—"మైసూరు" అంటే "మహిషాసురమర్దని" అనే దేవత పేరుగల రాష్ట్రం.

ఇక, "దేవి"యొక్క మూడో అవతారం "సరస్వతి" పూర్వ మొకప్పుడు శుంభుడు నిశుంభుడు అనే యిద్దరు రాక్షసులు హిమాలయ పర్వతములలో తపస్సు చేస్తున్నారు. ఆ సమయంలో స్నానంచేయడానికి గంగ వద్దకు పార్వతీదేవి వచ్చింది. అప్పుడు పార్వతిశరీరంలోనుంచి ఒక చక్కని సుందరమైన కన్య పుట్టింది. ఆమె పేరు "సరస్వతి". పర్వతాలలో సరస్సులు ఉంటాయి. ఆ సరస్వతిని చూచి శుంభ నిశుంభులు మోహించారు. కాని, సరస్వతికి ఆ రాక్షసులమీద కోపం వచ్చింది. సరస్వతిమీదకు "చండ", "ముండ" అనే యిద్దరు రాక్షసులను శుంభ నిశుంభులు పంపించారు. ఆసరస్వతి చండముండులతో యుద్ధం చేసింది. ఆ విధంగా యుద్ధం చేసే సమయంలో సరస్వతి ముఖంలోనుంచి కాళి అనే శక్తి పుట్టింది. కాళి అతి భయంకరంగా ఉంది. మేకతోలు ధరించిఉంది. రక్తం ప్రవహిస్తూఉన్న తల పుర్రెలను మెడలో మాలగా ధరించింది. వ్రేలాడుతూ రక్తం కారుతూఉన్న నాలుక కలిగిఉంది. కళ్లు చింతనిప్పులు లాగున ఎర్రగా ఉన్నాయి. ఈ చండముండులను కాళి సంహారించింది. అందుచేత యీ కాళికి చాముండీ అనే పేరును పార్వతి పెట్టింది. అటుపిమ్మట శుంభనిశుంభులు స్వయంగా సరస్వతి మీదకు యుద్ధానికి వెళ్ళారు. అప్పుడు సరస్వతియొక్క శరీరంలోనుంచి చండిక అనేశక్తి పుట్టి, శుంభ నిశుంభులనే యిద్దరు రాక్షసులను చంపివేసింది. శుంభనిశుంభుల యొక్క సేనలో రక్తబీజుడు అనే రాక్షసుడొకడున్నాడు. వాని శరీరంలోనుంచి యుద్ధభూమిమీద 'ఒక్కొక్క నెత్తురు చుక్కక్రింద పడితే, ఆ నెత్తురు చుక్కలోనుంచి ఒక్కొక్క రాక్షసుడు పుట్టుతూ ఉన్నాడు. ఈనెత్తురు చుక్కలుక్రిందకు పడకుండా చూడవలసినదని కాళికి సరస్వతి ఆజ్ఞయిచ్చింది. కాళి ఆ రక్తమునంతను క్రిందపడకుండా తాగివేసింది. అప్పుడు రాక్షససైన్యం క్రమక్రమంగా తగ్గిపోయింది. రక్తబీజుడు కూడా చండిక చేతిలో మరణించాడు. సరస్వతిఅంటే విద్యాదేవత - విద్యవల్ల లభించేశక్తి చాలా గొప్పది-కాని ఆ శక్తిని చూచి మోహించి తన స్వలాభంకోసం దానిని ఉపయోగించేవాడు రాక్షసి - ఆ విద్యాశక్తిని ఉపయోగపరచుకొని లోకాన్ని పీడించేవాడురాక్షసి—అటువంటి రాక్షసులను ఆ సరస్వతీరూపంలో ఉన్న దేవి తప్పకుండా సంహారిస్తుంది.

ఇక దేవియొక్క నాలుగో అవతారం యోగమాయ. ద్వాపరయుగంలో విష్ణుమూర్తి దేవకీదేవునకు కుమారుడై కృష్ణమూర్తిగా అవతరించాడు. ఆ సమయంలోనే వ్రేపల్లె అనే గొల్లలగూడెములో నందునకు అతని భార్య యశోదకు ఒక కుమార్తెగా మాయాదేవి పుట్టింది. వసుదేవుడు తనకు పుట్టిన మొగబిడ్డను (కృష్ణుని) రాత్రివేళ రహస్యంగా తీసికొనిపోయి వ్రేపల్లెలో నందునియింటిలో ఉంచాడు. నందునియింటిలో పుట్టిన యోగమాయ అవతారమైన ఆడపిల్లను తెచ్చి వసుదేవుడు తన భార్యయైన దేవకిప్రక్కలో పరుండబెట్టెను. దేవకీ వసుదేవులకు పుట్టినబిడ్డ కంసుణ్ని చంపివేస్తుంది అని ముందుగా కంసునకు తెలియజేయబడింది. అందువల్ల ఆ బిడ్డను పైకి ఎగురవేసి కత్తితో నరికివేయవలెనని కంసుడు కత్తి పైకెత్తెను. కాని, పైకి ఎగురవేయబడిన ఆబిడ్డ క్రింద పడలేదు. ఆకాశంలోనే నిలిచింది. "యోగమాయ"ను నేను అని చెప్పింది.

"ఓ కంసుడా! నిన్ను చంపే టటువంటి పిల్లవాడు వ్రేపల్లెలో పెరుగుతున్నాడు" అని చెప్పి ఆ యోగమాయ ఆకాశంలోనే కన్పించకుండా పోయింది. చిట్టచివరకు శ్రీకృష్ణుడు పెరిగి పెద్దవాడై భక్తియోగం, జ్ఞానయోగం కర్మయోగం మొదలైన యోగపద్ధతులను లోకానికి ఉపదేశించాడు. యోగీశ్వరులకు కూడా యోగపద్ధతులను బోధించిన యోగేశ్వరుడైనాడు—

దేవియొక్క అయిదో అవతారంలో ఒక రాక్షసుణ్ని ఆ దేవి తన దంతంతో చంపివేసింది. అందువల్ల ఆమెకు "రక్తదంతిని" అనే పేరు వచ్చింది.

ఆరో అవతారంలో ఒక గొప్ప క్షామంలోనుండి (కరువులోనుండి) లోకాన్ని ఆదేవి కాపాడింది. అందువల్ల ఆమెకు "క్షామాంబ"అనే పేరు వచ్చింది.

ఏడో అవతారంలో దుర్గాసురుడు అనే రాక్షసుని ఆ దేవి సంహారించడంవల్ల ఆమెకు "దుర్గ" అనే పేరు వచ్చింది.

ఎనిమిదో అవతారంలో దేవికి"మాతంగి" అనేపేరు వచ్చింది.

తొమ్మిదో అవతారంలో దేవికి "లభ్రమారి" అనే పేరువచ్చింది.

దేవీ నవరాత్రులు తొమ్మిది రోజులలోను వరుసగా దేవియొక్క తొమ్మిది అవతారములను గూర్చి ధ్యానం చేసి పూజ చెయ్యాలి. పదియవ రోజున చేసే పండుగకు విజయదశమి అంటారు. విజయదశమి రోజున అనగా (9 రోజులు పూర్తిగా దేవిపూజ చేసిన పిమ్మట) యీ 10 రోజున ఏ పనియైనా ప్రారంభిస్తే దేవిదయవల్ల తప్పకుండా ఆ పని జయప్రదంగా నెరవేరుతుంది. ఇందువల్ల దీనిని "విజయదశమి" అన్నారు. ఈ విజయదశమినాడు జమ్మిచెట్టును పూజచేస్తారు. పూర్వకాలంలో శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణులతో కలిసి అయోధ్యానగరం విడిచి అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడు అయోధ్యానగరం బయటఉన్న జమ్మిచెట్టుకు (శమీవృక్షానికి)పూజచేసి బయలుదేరి వెళ్లినాడు. పాండవులు విరాటరాజు కొలువులో మారువేషాలతో ఎవరికీ తెలియకుండా అజ్ఞాత

# పాప నక్షత్రం

రచన:
పాండురంగ విఠల్
(13 సం॥) గుంటూరు.

—బహుమతి గేయం—



పాప: మిలమిల వెలిగే నక్షత్రమా,
నన్ను చూడగా రమ్మంటేయి!
నీలిమబ్బులో నీకోసమ్మయి
నిరీక్షసేయుచు ఉన్నానే.

పగలంతయును ఎటదాగుదువో
అగుపించవు ఒకపాటియైనా
బుల్లినేస్తమా, నాకున్నట్లే
ఇల్లూ, నాన్నా, నీకున్నారా?

నక్షత్రం: చిట్టిపాపా, నీకుగాఢనిద
పట్టుసమయమున నే వస్తాను
తెల్లతెల్లగా తెలవారగనే
మెల్లమెల్లగా ఇంటికి వెడతా.

నీలిమబ్బులోని వసించుచునా
నేస్తాలెందరో నాకున్నారు
ఓరిమి దయతో నను శాసించే
కూరిమి నాన్నగూడా కలరు



# దసరాపండుగ అంటే ఏమిటి?



గానంలో ఉన్నారు. అరణ్యవాసం ముగి
సిన పిమ్మట నే ఈ అజ్ఞాతవాసం చేశారు.
అజ్ఞాతవాసం • మొదలుపెట్టినప్పుడు తమ
ఆయుధాలను ఊరిబెలుపల ఒక జమ్మిచెట్టు
కొమ్మలచాటున దాచివేశారు.

ఆశ్వయుజశుద్ధ దశమినాడు, శ్రవణా
నక్షత్రమైన శుభదినమందు, జమ్మిచెట్టు
మీదనుంచి విజయుడు-అనగా అర్జునుడు
తన గాండీవం అనే విల్లును తీసి ధరించి
విరాటరాజుయొక్క ఆవులను పట్టు
కొన్నటువంటి కౌరవులతో యుద్ధంచేసి
జయించివచ్చాడు. అందువల్ల దీనికి విజయ
దశమి అనేపేరు మరింత బాగా కుదిరింది.
రావణాసురునితో రాముడు ఎంతపెద్ద
యుద్ధం చేసినప్పటికీ రావణాసురుని సంహ
రించలేకపోయెను. అప్పుడు శ్రీరాముడు
దేవిని ఆరాధించి ప్రార్థించెను.
దేవి ప్రత్యక్షమై "యీసారి రావణునితో
యుద్ధంచెయ్యి - నీవు తప్పక గెలుస్తావు"
అని శ్రీరామునితో చెప్పింది. ఆ ప్రకారంగా
శ్రీరాముడు తిరిగి యుద్ధం చేసి రావణా
సురుని సంహరించివేశాడు. అటుపిమ్మట
యీ దేవీ నవరాత్రులయందు యుద్ధంలో
మరణించినవారికందరికీ పరలోక ప్రాప్తి
కలిగేటందుకై చేయవలసిన కర్మలు
శ్రీరాముడు చేసి, పదియవరోజున జయభేరీ
మ్రోగించి సీతాదేవితో సహా అయోధ్యకు
బయలుదేరినాడు. ఈ ప్రయాణము విజయ
దశమినాడే శ్రీరామచంద్రుడు సాగిం
చాడు.

ఈనాటివరకు బడిపిల్లలు యీ నవరా
త్రులలో సరస్వతి పూజలు చేస్తున్నారు.
అర్జునుడు విల్లు చేతబట్టినట్లుగా
కర్రవిల్లంబులను చేతిలో పుచ్చుకొని
బడిపంతులుతో కలిసి కొత్త చొక్కాలు
తొడుక్కొని తిరుగుతూ ఉంటారు. శ్రీరా
మచంద్రుడు తన హనుమంతునితో సహా
అయోధ్యకు బయలుదేరినాడన్నట్లుగా
అట్టతో చేయబడి వెదురుబద్దకు అంటగట్ట
బడిన హనుమంతుని బొమ్మను తాడుతో
లాగి ఆడిస్తూ పిల్లలు అందరూ శ్రీరాముని
నమ్మిన బంట్లులాగున విజయదశమికి విశేష
మైన విజయోత్సాహంతో పప్పు బెల్లాలు
తింటూ బడిపంతులుకంటే ముందుగా నడి
వీధులలో పరుగులెత్తుతూ ఉంటారు. ఇది
పెద్దవాళ్లకు, యోగీశ్వరులకు, పండితులకూ,
మహారాజులకూ ఎంత గొప్ప పండుగో,
పిల్లవాళ్లకుకూడా అంత గొప్ప పండుగ.
ఈ పండుగగోలలో ఈ భారతదేశంలో
ఎవరుపల్కినా ఒక్కటే మాట.

"జయ విజయీ భవ!
దిగ్విజయీ భవ!"





# పిల్లి శకునం

**బహుమతిపొందిన కథ**

రచన:

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

(15 సం॥) కాటూరు.

పిరెవ్వరూ నమ్మతారో నమ్మరోగాని నాకు మాత్రం "పిల్లి" అంటే మహాచెడ్డ వళ్లుమంట! కారణం ఏమిటంటారేమో! ప్రొద్దున్నే మనం లేవటంతోటే ప్రథమంగా మార్జాల దర్శనం చేసికొన్నామా, ఆరోజున యేదోవిధంగా మన పాపం బ్రద్దలయిందన్నమాటే. ఇదంతా అనుభవంమీద చెప్తున్నసుమండీ! పెద్దవాళ్లు చెపుతుంటే వట్టిదనుకునేవాణ్ణి. కాని నిజమే!

ఆరోజు సోమవారం. ప్రొద్దున్నే లేవడం కొంచెం ఆలస్యమయింది. కళ్లు తెరిచాను. ఎదురుగుండా నల్లటిపిల్లి గ్రామఫోనురికార్డుమీద కుక్క కూర్చున్నట్లుగా కూర్చుని "మ్యావ్ మ్యావ్" అంటూ నాకు మేలుకొలుపు పాడుతోంది. నాకర్మకాలిందిరా బాబూ ఇవ్వాళ అనుకుంటూనే వున్నాను. ఇంతలోనే నాన్నగారు వచ్చారు—" "వెధవా! ఇంతసేపటికిరా నీవు లేచేది? ఇంకెప్పుడు బళ్లోకి వెడతావు? గాడిదా! నిన్నుతొక్కి నారదీస్తా" అంటూ అట్లాగే వచ్చి వంగదీసి నా వీపుపై లెక్కకు రెండేరెండు వేశారు. ఇంకేముంది? పిల్లిశకునఫలితం వెంటనే ప్రత్యక్షం. ప్రథమ తాంబూలం అందిందన్నమాట. నాన్న దెబ్బలుకొట్టేసరికి లెక్కలు చేయకపోయినందువల్ల బళ్లో మాష్టరుగారు కొట్టే దెబ్బలు గుర్తుకొచ్చాయి. పోనీ అప్పటికప్పుడు చేద్దామా అంటే టైము లేదు. బడి మానేద్దామా అంటే ఇవ్వాళ్ళ ఇంట్లో నాన్నగారితోను, రేపు బళ్లో పంతులుగారితోను "ఇంతింతై, వటుడింతయై" అన్నట్లుగా ఇంతకింత ఎక్కువగా వీపు చెడుతుంది. పోనీలే ఒక చిన్న అబద్ధమాడేద్దామని తోచింది. త్వరగా కాలకృత్యాలు తీర్చుకొని (ఒకటి మానేశానులెండి) బడికి జేరాను. అప్పటికే పది నిమిషాలు ఆలస్యం. ఛీ! ఇవ్వాళ్ళ అన్నీ ఎదురుగానే వస్తున్నాయి! ఇదంతా పిల్లిమూలానగదా అని పిల్లిమీద ఇంకా కోపం ఎక్కువయింది. మళ్లీ ఇంకోసారి కనిపిస్తే చంపేద్దామనిపించింది.

క్లాసులోకి వెళ్ళాను. ఆలస్యంగా వచ్చినందుకు మాష్టరుగారు బెంచీమీద నుంచోమన్నారు. ఒక అబద్ధం ఆడేశాను. "మా అమ్మ ఆలస్యంగా అన్నం వండిందని. కాని మాష్టారింకోసారి కసిరేసరికి తప్పనిసరిగా బెంచీమీద నుంచున్నాను. సరే బాగానే ఉంది. ఇక దెబ్బలు తింటానికి సర్వసిద్ధంగా ఉన్నాను. కాని అదృష్టవశాత్తు మాష్టరుగారు ఆ రోజున అసలు లెక్కలు చేశారా? లేదా? అని యెవ్వర్నీ అడగనే లేదు. ఒక అరగంటలో నన్ను బెంచీమీదనుండి దింపేశారు. అమ్మయ్య! బ్రతికాంరా నాయనా అనుకున్నా. సాయంత్రందాకా నాకు మరి యేవిధమైన సంభావనా కూడా ప్రాప్తించలేదు బడిలో...

పిల్లిశకునప్రభావం పోయిందిరా నాయనా అనుకున్నా. బడినుండి తిరిగి వస్తున్నా. హోటలులోనుంచి క్రొత్తగా విడుదలయిన బాలరాజులోని "తియ్యనివెన్నెలరేయి" పాట వస్తోంది. అబ్బ ఎంత బాగుంది! ఇంకా నేనా సినిమా చూడలేదు. ఎవరో చెప్పారు ఆ సినిమాలో ఆ పాట ఎవరో దేవకన్య పాడుతుందని. ఎల్లాగైనా ఆ రోజున ఆ సినిమాకు వెళ్లాలనిపించింది. త్వరగా ఇంటికి



"నా బొమ్మ" బహుమతి పొందిన చిత్రం

చిత్రకారిణి సి.హెచ్. సిరిదేవి; (వయస్సు 3 సంవత్సరములు); మద్రాసు.



గాంధీజీ

(శాస్త్రి—విజయవాడ)

# మా ప్రార్థన!

**శ్రీ పోలవరపు శ్రీహరిరావు**

అందరికీ ఒరవడిగా-
శాంతి, సౌభ్రాతృత్వం,
స్వేచ్ఛా, అంత శ్శుద్ధి,
దశదిశలా చాటిన దేశం
—మత్తిలి నిదరోయిన రోజున;
పరదేశపు సరదారులు---
మా పంటలచేలపైన
జరిపించిన ధ్వంసలీల
మా స్వేచ్ఛను కొల్లగొట్టి
—పాలన చేకొన్న పిదప;
ఐక్యతగా నుంట మరచి;
రక్తమోడ్చి, ఫలమంతా
సరదారుల పాలుజేసి,
మన్నుదిన్న పురుగుల్లా
—మెలగిన ఆ హీనదశలో;
మన్నునుంచి మమ్మందరి
మనుషులుగా మేలుకొలిపి,
స్వేచ్ఛోన్ముఖులుగ నడిపిన
భారత జాతీయ పితా !
—మా ప్రార్థన ! మా కోరిక!!
ఏబదేళ్ళు నువు నేర్పిన—
"స్వయంసేవ, సద్వర్తన,
శాంతిలోక సంస్థాపన,
మా కర్తవ్యమ్ము" నే నిజం
—మరచెను నీ యీ సంతతి;
బాపూ ! నీ భారత దేశం—
బహుముఖాల తెప్పరిల్లి
సంస్కృతి పాండితి గడించి,
శాంతి శంఖ మూదుకొంచు
—మెలగునట్లు జేయుమయ్య!
ఓహో ! మా ధ్రువతారా!!
ప్రియభారత ధ్రువతారా !
భారత జాతీయ పితా!!
శాంతిలోక శ్రీవిహారి !
—మన్నించుము మా ప్రార్థన

# ★ పిల్లి శకునం

(8-వ పేజీ తరువాయి)

పెళ్ళి అమ్మతో అన్నంపెట్టించుకొని తిని నాన్నగారి రాకకి ఎదురుచూస్తున్నా—మరిడబ్బులు, పర్మిషను కావాలిగా! నాన్నగారు వచ్చారు. కాని అడగటానికి భయం. ఎట్లాగయితేనేం ధైర్యం చేసి అడిగా.

"పళ్లు రాలతాయి వెధవా! నీకు సినిమాలు, నిద్ర, షోకులు ఎక్కువయ్యాయి. చదువు శూన్యం. రాత్రి నేను చెప్పినపద్యం కంఠతా పట్టావా? ఇప్పుడు అప్పచెప్పకపో.నీ డొక్క పగులదీస్తా" అని కేకలేశారు.

కళ్ళనిండా నీళ్లు వస్తున్నాయి. ఛీ! ఎప్పుడూ వెధవ చదువు. శని అయినా వదులుతుందేమోగాని ఈ చదువు వదలదు. అసలు ఈ దేశములో చదువు లేకపోతేనే బాగుండునని పించింది. కాని తప్పదుగా? త్వరగా పెద్ద లాంతరు వెలిగించి ముడుచుకుపోయిన మొహంతో (దేవుడా అని) చదువుకుంటానికి కూర్చున్నా. ఆపద్యం నోరు తిరగడంలేదు. ఆ పద్యంకూడా 'తిలోత్తమ' అనే దేవకన్యకమీద వ్రాసిందే. ఇంతకీ ఏమిటయ్యా అంటే సుందుడు, ఉపసుందుడు అనే యిద్దరు రాక్షసోదరులను చంపటానికి వచ్చి వాళ్ళ తోటలో చెట్టెక్కి వీణవాయిస్తోందిట అందముగా. ఆ పద్యం అర్థం అదిట! అదేపనిగా నానా శోషపడుతూ అనేక తప్పులతో ఆపద్యం కంఠతా పెడుతున్నా.

అబ్బ! ఎంత బాగుంది ఆతోట! రకరకాల పువ్వులు సెంటులాగా బలే వాసన వేస్తున్నాయి. బంగారపు పువ్వులచెట్లు, రకరకాల పళ్ళ చెట్లు—తోటంతా ఎక్కడ చూసినా తోరణాలు—ఎలక్ట్రిక్ లైట్లు—అక్కడక్కడ కూర్చునేందుకు రంగురంగుల కుర్చీలు. ఇదేం తోటరా నాయనా క్రొత్తరకంగా ఉంది. మనఊళ్లో పార్కు అట్లా లేదేం? నరసంచారము లేనే లేదు. ఆ తోటలో బాటలన్నీ చక్కగా అప్పుడు తుడిచినట్లున్నాయి. నిండు

(12-వ పేజీ చూడండి)

# బాపుజీ



ఆర్. రేచల్ (14–సం) బెజవాడ.

చిక్కిన బక్క దేహమును;
చిందుచునుండెడి నవ్వుమోమునుం
జక్కని గాంధి మాకనుల
చాటయిపోయెనె నేడు దుర్విధీ!
ఎక్కడిగాంధి! మాకు నిక
నెల్లగుపించును శాంతమూర్తిమా
కెక్కడవిందు మిట్టి దుర
దృష్టము భారతమాత కబ్బెగా;

సత్యము శాంతమే పరమ
సౌఖ్యములిచ్చు నటంచు బల్కు నీ
ముత్యపుమాటలన్ వినిన
ముచ్చటనొందెను భారతాంబ నీ
నిత్యయశంబు సర్వ ధర
ణీతలమందున వ్యాప్తిచెందె దా
గ్గస్యము మమ్ము పొందె గుణ
గణ్యుడ నీవగదయ్య బాపుజీ;

తెచ్చితి వీవు రాజ్యమును
దెచ్చితి విచ్చితి వీవు మాకు మా
ముచ్చట దీరకుండగనె
ముంచుకవచ్చెను రోజు లక్కటా!
పొచ్చెము గల్గియుండి విను
పోవగజేసె కిరాత వర్గముల్
చచ్చునుగాని నిన్నిటుల
జావగజేసిన వారలుందురా;

పారుడు వచ్చి బ్రాహ్మణుడు
బాపురె! సన్న తుపాకి గాల్వగా
దీరని మచ్చ గల్గినది
దేశములన్ని వడంకిపోయె నీ
యారని కీర్తిదీపిక స
మస్త ధరాస్థలి వెల్గుచుండెగా
భారతవీర లోకనుత [తుల్;
బాపుజి! గాంధి యివే నమస్కృ

కాలకిరాతకుండయిన
"గాడ్సె" వధించెనునిన్ను ప్రార్థనా
గ్రాలయ మండపంబున నె
హో! అదియెట్టి ముహూర్తకాలమో
ఏం యిటుల్ పొనర్చెనత
డే మపకారము నీ వొనర్చితో

కాలము దాపురించినది
గావలె నింతకునీకు బాపుజీ!
విజయదశమికే వుండినచో
నెంతయొ బాగుండుగదా
బాలవీరులుగ మేమగు న
ట్లాశీర్వదించుమో బాపూజీ!



## గాంధీయా, రాజాజీయా?

—చి॥ శ్రీపాద వెంకట

ఇది గాంధిజీ ఫోటోకు రాసిన ప్రతికృతి. "ఇది రాజగోపాలాచారిగారి లాగున్న దేమి?" అని అడిగితే, ఇప్పుడు అన్నిబొమ్మలూ ఆయనే తయారు అవుతున్నాడు. కనక ఏబొమ్మరాసినా ఆయన బొమ్మే వస్తోంది" అని జవాబు చెప్పాడు.



# పిల్లి శకునం



(10-వ పేజీ తరువాయి)

చంద్రుడు ప్రకాశవంతముగా వెలుగుతున్నాడు. నే నెల్లా వచ్చానబ్బా! ఈ తోటలోకి? అసలిది ఏవూరు? యేమీ తెలియడంలేదు. చాల భయంవేస్తోంది. ఎవరినన్నా కేకేద్దామంటే నోరు రావడంలేదు. ఈలాగు చాలా సేపు తిరుగుతున్నా. ఆకలేస్తోంది. ఇంకా కొంచెం దూరంపోయాను. అక్కడ ఒక చక్కటిచెఱువు స్వచ్ఛమైన నీళ్లతో, తామరపువ్వులతో, హంసలతో నిండివుంది. వద్దునే మామిడి పళ్ల చెట్టు. రెండుపళ్లు కోసి తింటున్నా. నెమ్మదిగా "తియ్యని వెన్నెలరేయి" పాట వినిపించింది. చుట్టూ చూశాను. యేమీ లేదు. చెట్టుపైకి చూశాను. ఎవరో అమ్మాయి—ఆఁ! తిలోత్తమే! వీణ వాయిస్తూ పాడుతోంది. నిజంగా ఎంత హాయిగా వుంది! పాటయిపోయింది.

"నేను కూడా చెట్టెక్కనా?" అని అడిగాను.

"ఊఁ" అంది ఆ అమ్మాయి—అహాఁ తిలోత్తమ. గబగబ సంచి కిందపడేసి చెట్టెక్కాను.

"ఆ కొమ్మ చివర వేలాడుతున్న ఆమామిడిపండు నాకు కోసిపెట్టు" అంది తిలోత్తమ.

కొమ్మ చివరకు వెళ్ళాను. కాయకోశాను.

"వెధవా! నిన్న పద్యం కంఠతాబట్టి అప్పజెప్పరా అంటే ఇక్కడకువచ్చి కాయలు కోస్తున్నావా?" అనే కేకవినబడింది. క్రిందికిచూచా—అమ్మో నాన్నగారు! బెత్తంచేత్తో పుచ్చుకుని దిగి రమ్మంటున్నారు. తిలోత్తమ ఉన్న వైపు చూశా. తిలోత్తమ లేదక్కడ! ఆశ్చర్యం, భయం నన్నొక్కసారిగా చుట్టేశాయి. కాళ్లు, చేతులు పట్టు తప్పాయి. గుభేలున చెట్టుమీద నుండి పడిపోయా చెర్వులో 'బాబోయ్' అంటూ.

*       *       *

"బాబోయ్" అని వులిక్కిపడి లేచాను. నాన్నగారు అప్పటికే వీపుమీద ఒక దెబ్బవేశారుగా వున్నమంటెత్తుతోంది - "వెధవా! చదవరా అంటే నిద్రపోతున్నావా? పద్యం వచ్చిందా?" అని కాలిమీద ఇంకోటివడ్డించారు. ఆదెబ్బ తప్పించుకుంటానికి పక్కకి ఒరిగితే లాంతరు క్రింద పడింది. లాంతరుకు వున్న పిల్లిమార్కు గ్లాసుమీద నా అరచేయి పడి కాలింది. 'ఇస్ అబ్బ' అనుకుని చెయ్యిచూసుకుంటే అరచేతిలో "పిల్లి" మార్కు ముద్ర వుంది. 'హుఁ ఖర్మ' అనుకున్నా—

"రోజు ప్రొద్దున్నే లేచి అరచేయి చూస్తే మేలవుతుం"దని చెప్పిన అమ్మమ్మ మాట ప్రకారం చేద్దామన్నా "పిల్లి"ని చూడాల్సి వచ్చింది. ఇదంతా పిల్లిశకున ప్రభావమే! "పిల్లి" అంటే అందుకే నాకంత మంట. 



స్వేచ్ఛాజీవి

కె. ప్రభాకర రావు; (10 సం॥) నారాయణపేట

# గాలి దయ్యం



**కాలజ్ఞానం వీరరాఘవరావు**
(వయస్సు 14-సం. తిరుపతి)

వెంకటేశ్వర్లు, రామ్మూర్తి యిద్దరు చాల ప్రాణస్నేహితులు. ఒకరికిగాను యింకొకరు తమ ప్రాణాలైనా అర్పిస్తారు. ఇద్దరు ఒకేతరగతి అంటే రెండవఫారము చదువుతుంటారు వెంకటేశ్వర్లు తండ్రి ఒక జమీందారు, పెద్ద ధనికుడు. రామ్మూర్తితండ్రి ఒక సాధారణగుమాస్తా. చాలబీదవాడు పాపం. రామ్మూర్తివాళ్లింట్లో, బీదవాళ్లు కనుక లాంతరుదీపం కూడా వుండేది కాదు. కాబట్టి ప్రమిదెలో చదువుకోవాలి, అందుకని వెంకటేశ్వర్లు తన ఫ్రెండు రామ్మూర్తిని తన యింటికే వచ్చి, లాంతరు దీపంలో తనతోకూడ చదువుకోమన్నాడు. రామ్మూర్తి దానికి సమ్మతించాడు. వాళ్లిద్దరు మేడమీద చదువుకునేవారు. రామ్మూర్తి తన యింటినుండి వెళ్ళేటప్పటికి, వెంకటేశ్వర్లు మేడమీద చదువుకొంటూండేవాడు. ఇలా వారిద్దరు ఒకరికొకరు అన్యోన్యంగా మెలగుతూ వచ్చారు.

ఇలావుండగా ఒకనాడు వాళ్ల ఉపాధ్యాయుడు ఏదో ఒక కథ దెయ్యంమీద చెప్తూ, "ఒకవేళ దెయ్యం వచ్చినాకూడ మనం భయపడకూడదు, ధైర్యంగా చెప్పుతో కొట్టను పోవాలి. అప్పుడు అది భయపడి వెళ్ళిపోతుంది. అలా గాని చెయ్యకపోతే అదే మనల్ని చంపేస్తుంది." అని చెప్పారు. అప్పటినుండి మన వెంకటేశ్వర్లు, ఒకవేళ, రామ్మూర్తి వచ్చేంతవరకు మేడమీద చదువుకున్నా భయపడకుండ, ధైర్యంగా వుండేవాడు.

ఇలా వుండగా ఒకరోజు




ఐస్ ఫ్రూట్
(పగడాల చిరంజీవి రావు; 10 సం||; ఏలూరు)

 

# గాలిదెయ్యం



మామూలు ప్రకారము వెంకటే శ్వర్లు ముందుగా పోయి మేడమీద చదువుకొంటూన్నాడు. అప్పుడు మామూలు ప్రకారం రామ్మూర్తి కూడ మేడమీదికి వచ్చి, వెంకటే శ్వర్ల ప్రక్కకు చేరాడు. కాని వెంకటేశ్వర్ల అటువైపు వున్న తలుపు కదిలి కీలువద్ద 'కిర్' మని శబ్దం వస్తూంటే తదేకదీక్షతో చూస్తు న్నాడు. కాని రామ్మూర్తిని చూడ లేదు. వెంకటేశ్వర్ల ప్రక్కనున్న రామ్మూర్తి కూడ ఆ శబ్దాన్ని చూచి, "ఓయబ్బో! గాలిదెయ్యం" అంటూ అక్కడుండే టేబిల్ క్రిందకు పోయి ముడుక్కున్నాడు. అటు వైపు చూస్తున్న వెంకటేశ్వర్లు కొంచెం భయంతో ఉలిక్కిపడి రామ్మూర్తినే గాలిదెయ్యం అను కున్నాడు. వెంటనే తమ ఉపాధ్యా యుడు చెప్పినట్లు "దెయ్యం కన పడితే చెప్పుతో కొట్టాలి" అన్న మాటలు జ్ఞప్తికొచ్చి, వెంటనే ఒక మూలనున్న రెండు చెప్పులను, రెండుచేతుల్లో తీసుకవచ్చి, మన మేజాక్రింద ముడుక్కొనున్న రామ్మూర్తిని కొట్టడం ప్రారంభిం చాడు. రామ్మూర్తి "ఓయబ్బో!" అని అరుస్తూంటే, వెంకటేశ్వర్లు "యిక మీదట వస్తావా? దెయ్యం అయితే మాత్రం నిన్ను చూచి భయపడ్తాననుకున్నావా?" అని గట్టిగా కొట్టసాగాడు. ఆ మాటలు విన్న రామ్మూర్తి "ఒరే! వీడు మనల్నే దెయ్యం అనుకున్నా"డని గ్రహించి, "ఓరేయ్! వెంకటేశ్వర్లు, నేను నీ ఫ్రెండునురా! రామ్మూ ర్తిని. దెయ్యాన్ని కాదురా. దినం ప్రకారము చదువుకోనువచ్చాన్రా" అని అరిచాడు. కాని వెంకటేశ్వర్లు "ఓహో! ఈ గాలిదెయ్యం మనల్నే మార్చేదాని కిలా మాట్లా

(64-వ పేజీ చూడండి)



కాందిశీకులు

జి. ఎస్. సత్యనారాయణరావు; (15 సం॥) గుంటూరు

# పండగ సరదాలు

**శ్రీమతి సుబ్బలక్ష్మి**

(వయస్సు 15–సం॥) విజయవాడ.

దసరా పండక్కి అత్తవారింటికి వెళ్ళడానికి గోపాలం నిశ్చయించుకున్నాడు. సాయంత్రం ఈ సంగతి సత్యానికి చెప్పాడు. సత్యం నవ్వుతూ "ఏరా! ఇదే మొదటి సారి కాబోలు! జాగ్రత్తరోయి! మరదలు చేసే హాస్యాలకు తట్టుకోవాలి. అందులో మీ మరదలు చదువుకొన్నదని చెప్పావు! ఎందుకైనా మంచిది ఒక కంటకనిపెట్టు" అన్నాడు. అందరి అల్లుళ్ళలాగా కాకుండా మరదలినే ఏడిపించాలనుకున్నాడు గోపాలం.

మర్నాడు అత్తవారింటికి బయల్దేరాడు. ఆ వూళ్లో దిగేటప్పటికి 9 గంటలయింది. ఆకలి మాడ్చేస్తోంది. ఇలాంటప్పుడు అత్తవారింటికి వెళ్ళి కాఫీ తాగలేదని చెప్తే ఏం బాగుంటుంది? ఎలాగైనా కొత్తల్లుడు! మొహమాటంకదూ? అందుకని ఎదురుగావున్న హోటలుకు వెళ్ళి, టిఫిను, కాఫీ, తీసికొని కిళ్ళీ ఒకటి జేబులో వేసికొని ఒకటి నములుతూ అత్తవారింటికి బయల్దేరాడు. అత్తగారు, మామగారు కుశల ప్రశ్నలు వేశారు. గోపాలం, మామగారు, బావమరదులతో భోజనానికి కూర్చున్నాడు. భోంచేస్తూండగా మధ్యలో మరదలు కమల వడ్డించడానికి వచ్చింది. మహా ఆప్యాయంగా గోపాలం విస్తట్లో పెరుగువడలు వడ్డించింది. కమల చిన్నతమ్ముడు "నాకూ కావాలే" అని అరుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయింది. తర్వాత వేరేపళ్ళెంలో తీసుకొచ్చింది. అందరికి వడ్డించేవి కాకుండా, మరదలు తనకా ప్రత్యేకత, ఎందుకిచ్చిందని అనుమానం వేసింది. అందరికి వడ్డించేటప్పుడు తనకి వడ్డించినవి మాత్రమే తిని భోజనం చేశాడు.



బావి నుంచి

(ఎన్. కె. విశ్వనాధరావు)

—రాజమండ్రి.

"బ్రతుకు జీవుడా" అని బయటికి వస్తూంటే కమల ఎదురై కిళ్ళీ అందించింది. అందరు తీరిగ్గా కూచుని తాంబూలం వేసుకుంటూంటే తనకీ మర్యాద ఎందుకనుకున్నాడు. కమల చూడకుండా ఆ కిళ్ళీ జేబులో వేసికొని, జేబులో కిళ్ళీ తీసుకొని నమలడం ప్రారంభించాడు. అందరిలోను కూచుని సర్దాగా కబుర్లు చెప్తూన్న బావకేసి తెల్లపోయి చూసింది కమల.

సాయంత్రం షికారుకెళ్ళిన గోపాలం జేబులో కిళ్ళీ విప్పి చూశాడు. చిన్న, చిన్న, గులకరాళ్ళు, వుప్పు, కారం కనిపించాయి. మళ్ళీ మామూలుగా కట్టేశాడు. రాత్రి భోజనాలతరువాత ఆకిళ్ళీ కమలకందించాడు. ఆకిళ్ళీ నమలబోయింది. నోరు మండడం, గులకరాళ్ళు గొంతుక్కి అడ్డంపడడం ఒకేసారి జరిగింది. బావచేసిన మోసం అర్థమయింది కమలకి. బావవంక కోపంగా చూస్తూ దొడ్లోకి పరిగెత్తింది.

ఆరుబయట పడుకొన్న గోపాలానికి "అల్లుడు గట్టివాడేనంటోయ్" అని అంటున్న అత్తగారి మాటలు వినిపించాయి. ★

# కన్నీరుకార్చే విగ్రహం

శ్రీ మరకాని జగదీశ్

రచయిత వయస్సు
14 ఏళ్లు.

చందనరాజుగారికి రాజ్యపాలనం మీద కన్నా రాణి చంద్రకళ పైనే ఎక్కువ శ్రద్ధ అని, ఆమెను విడిచి ఎక్కువకాలం ఎక్కడా గడపడని చెప్పుకుంటూ వుంటారు.

ఆశాలత అనే రాణివాసపు కన్య చందనరాజుగార్ని ప్రేమించింది. అయితే చంద్రకళను ఒక్క క్షణంకూడా విడిచివుండని రాజుగార్ని ఎలా వశపరచుకోవాలి?

ఇలా వుండగా చంద్రకళ గర్భవతి అయింది. ఇదే అదను అని ఆశాలత రాజుగారి మనసు మరల్చటానికి సర్వవిధాలా ప్రయత్నించింది. చంద్రకళకు శిశువు జన్మించినట్లయితే ప్రేమంతా ఆశిశువుపైనే కేంద్రీకరింపబడుతుందని చందనరాజుగార్ని కన్నెత్తికూడా చూడదని చెప్పారు. చంద్రకళ నిర్లక్ష్యపెట్టినట్టయితే తాను ఎలా జీవించటం? అందుకని ఆశాలత బోధించినట్లు రాణీని ఒంటిస్తంభము మేడలో పెట్టించి, మంత్రసానులకి శిశువు జన్మించగానే అరణ్యాలలో వదిలెయ్యమని ఆజ్ఞాపించారు.

చంద్రకళకు మొగశిశువు జన్మించాడు. రాజుగారి ఆజ్ఞప్రకారం మంత్రసానులు పాపను అరణ్యాలలో వదిలివేశారు. చంద్రకళ గగ్గోలు పెట్టింది. ఉన్నట్టుండి మాయమైన తన కొడుకుజాడలు చెప్పకపోయినట్లయితే మంత్రసానుల తలలు తీయిస్తానని ఆగ్రహించింది. వాళ్ళు భయపడిపోయి జరిగిన సంగతంతా చెప్పేశారు.

చందనరాజుగారి ప్రేమంతా కర్పూరంలా హరించిపోయినందుకు దుఃఖించింది.

చేసేదిలేక ఒంటరిగా కొడుకును వెతకటానికి బయలుదేరింది. ఎక్కడా జాడ లేదు. చివరికి శోకాన్ని భరించుకోలేక స్తంభించిపోయింది. శిలావిగ్రహంలా మారిపోయింది. ఆ విగ్రహం రెండు కళ్ళనుండి ఏకధారగా అశ్రువులు ప్రవహించటం మొదలుపెట్టాయి. అక్కడ అశ్రుధారలంతా ఒక పెద్ద మడుగు అయింది. ఆ మడుగునిండా పెద్ద పెద్ద తామరలు,



చక్కని హంసలు తయారయ్యాయ్. ఇంకా ఆ మడుగుమహత్తు ఏమిటంటే అందులో ఏ మనిషి మునిగినా చిన్నపాప ఐపోతాడు. ఆ పాపడు తామరాకులమీద పవళిస్తాడు. అందులోని హంసలు వాళ్లని కాపాడుతూ వుంటాయ్. పుష్పాలు తేనె పోసి పెంచుతాయ్. పాపలు ఏడ్చినప్పుడల్లా ఆ మడుగులోని నీళ్లు చక్కని సంగీతం పాడ్తాయ్. ఈ పాపల్నందర్నీ చూసుకుంటూ ఆ శిలావిగ్రహం మురిసిపోతూ వుంటుంది.

చంద్రకళపీడ వదిలిందని సంతోషపడ్తూ ఆశాలత వలలు అల్లుతోంది. రాజుగార్ని ఆ వలలో వెయ్యాలని చాల ప్రయత్నించింది. రాజుగారి విముఖత చూసి రాజ్యంపైనే కన్ను వేసింది. రాజుగారి విచారం పోగొట్టే నిమిత్తం వేటకు తీసికొని వెళ్లాలని మంత్రిని, సేనాధిపతిని ప్రయాణం కట్టించింది. వీళ్ళందరూ పోయి పోయి చంద్రకళ శిలావిగ్రహం వున్న ప్రదేశం చేరుకున్నారు. అక్కడ భార్య శిలావిగ్రహంకనపడగానే చందనరాజు ఆమెకోసం మడుగుకు అడ్డంపడి నడిచాడు. వెంటనే చిన్నపాపడిగా మారిపోయాడు. ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిన మంత్రిని, సేనాధిపతిని ఆశాలత మడుగులోకి తోసివేసింది. వాళ్ళూ శిశువు లైపోయారు. ఆశాలత రాజ్యాన్ని వశపరచుకున్నది. తన ఆత్మీయుల్ని మంత్రిగాను, సేనాపతిగాను నియమించుకున్నది.

అరణ్యాలలో వదిలబడిన చంద్రకళ కుమారుడు శశిని అక్కడి పక్షులు పెంచుతున్నాయ్. దినదినమూ పెరిగి పెద్దవాడౌతూన్నాడు. ఆ అరణ్యంలోని మృగాలందరికీ స్నేహితుడయ్యాడు. ఆ అరణ్యంలోని ఏ మృగానికైనా జబ్బువచ్చినా, ముళ్ళు గ్రుచ్చుకున్నా, కాళ్లు విరిగినా శశి దగ్గరకు రావలసిందే. అతడు చికిత్స చేయవలసిందే. మొసళ్ళ నోళ్లలో జలగలు పట్టుకున్నప్పుడు శశిదగ్గరకు వచ్చి నోరు తెరచి కూర్చుంటాయ్. శశి ఆ నోళ్లలో దూరి ఆ జలగల్ని తీసివేసి బైటకు వస్తూంటాడు.

ఇలా వుంటూండగా శశికి ఒక ఆలోచన

ంది. జంతువుల్లో జంతువులాగ ఎంత కాలం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి? అని. వెంటనే ఒక ముని దగ్గరకు వెళ్లి తన అనుమానం విన్నవించాడు. ఆయన నవ్వుకొని మానవుని కర్తవ్యం 'దుష్టశిక్షణ - శిష్టరక్షణ' అని చెప్పాడు.

అప్పటినుండి మునివాక్యం పరిపాలించటం ఎలాగా అని బెంగపెట్టుకున్నాడు. అడవి పక్షుల్ని లోక సమాచారాలు తెలిసికొని రమ్మని పంపించాడు అవి పోయిపోయి చందనమహారాజుగారి రాజ్యమే చేరుకున్నాయ్. అక్కడ ఆశాలత ప్రజల్ని పీడించి ధనం దోచుకుంటోంది ప్రజలు తిండికి గుడ్డకు కరవై కల్లోల పడుతున్నారు. ఇవన్నీ చూసి పక్షులు రివ్వుమని తిరిగివెళ్లి శశికి తెలియపరచాయ్.

శశి ఆలోచించి ఆలోచించి అడవి జంతువుల్నన్నిటినీ సమావేశపరచి వాటికేవేవో బోధించాడు.

ఆ రోజునుండి ఆశాలత, సేనాధిపతి, మంత్రి వారివారి ఆసనాలు స్వీకరించటానికి గజగజలాడిపోతున్నారు. ఎందుకంటే సింహాసన మధిష్ఠించినప్పుడల్లా గబ్బిలం కళ్ళల్లో పొడవటానికి ప్రయత్నిస్తుంది. ఏ ఆయుధానికీ దొరకదు ఇల్లాగే మంత్రి, సేనాధిపతుల్ని వారివారి తావుల్లో కూర్చోనివ్వదు. కొలువు తీర్చినప్పుడల్లా ఆశాలత కిరీటం ఒక గద్ద తన్నుకుపోతుంది రాణి అంతఃపురంలో తినుబండారాలన్నీ ఎలకలు పిల్లులు, పక్షులు మొదలైనవన్నీ గుటకాయ స్వాహా చేసేస్తున్నాయ్ బీద ప్రజల్ని రాజసైనికులు పీడించబోతే ఎక్కడినుండో గుంపులు గుంపులుగా రాబందులు వస్తాయ్. వాటిని చూసి సైనికులు ఒకటే పరుగు.

చివరికి రాజోద్యోగులకి నీతి గరపేందుకు శశి సింహాన్నొక్క దాన్ని పంపాడు ... బయలు దేరాడు. చంద్రకళ శిలావిగ్రహమున్న చోటికి రాగానే చీకటిపడింది. అక్కడ విశ్రమించాడు రాత్రి వెన్నెలలో మడుగు చక్కని పాట పాడుతోంది. ఆ పాటకు తనకూ నిద్రవస్తోంది ఇలా జాలిగా పాడటానికి కారణం ఏమిటా అని మడుగు ప్రవేశించాడు. ఆ మడుగులోవున్న ఒక మొసలి, శశిని వీపుమీద ఎక్కించుకుని శిలా విగ్రహంవైపు తీసికొని వెళ్లింది. ఆ విగ్రహం రెండుకళ్ళనుండి ప్రవహించే కన్నీరు చూసి గుండెనీరై "అమ్మా ఎందుకలా ఏడుస్తావ్" అని బుజ్జగిస్తూ అడిగాడు ఎప్పుడైతే కొడుకు స్పృశించాడో అప్పుడే

# తెలుగు పాపలం

### కవిరావు



చెక్కు చెదరని మొక్కవోని
శిల్పచాతురి వెల్లివిరిసిన
శ్రీల దనరెడి తెలుగు తల్లికి
పూలలం, సుమ మాలలం
ఆరని
ఆంధ్ర శౌర్య జ్వాలలం.
ఉగ్గుపాలతో కదన పాండితి
నిగ్గుతేర్చెడి వీరమాతల
తేనె లూరెడి జోలపాటల
లోన కుల్కిన వారలం
తేనెల
తెల్గు చిల్కెడి వారలం.
బాలచంద్రుని, బ్రహ్మనాయని
బాహు విక్రమ ప్రభలు చిందిన
పావనంబగు తెలుగు తల్లికి
పాపలం, కనుపాపలం
కేవటి
రూపు దిద్దెడి వారలం.
కందుకూర్గురజాడ అప్పారావు లక్ష్మణరావు లనబడు
చేవదేలిన తెలుగు ధీరుల
కోవలోపల వారలం
పెద్దల
త్రోవ త్రొక్కిన వారలం.

తిక్కనార్యుని దేశికవితకు
త్యాగరాయల తెల్గు గీతికి
వేమనార్యుని ఆటవెలదికి
నోచి పుట్టిన వారలం
పుణ్యము
చేసి పుట్టిన వారలం.
పేరు భేదములుడిగి మా నక్కూరు రాయలసీమలనియెడు
తెలుగు పాపల మొక్కపై మా
దేశభక్తిని చాటెదం
పుట్టిన
దేశమును ప్రేమించెదం.
జీవనదులౌ కృష్ణ గౌతమి
పావనోదక పూరములచే
సారమగు మాగాణములు బంగారుపంటలు పండగా
సిరి మా
గాదెలన్నియు నిండగా
విశ్వమానవకోటిలో మా
వీరయోధుల త్యాగదక్షత
పేరు పేరున చాటుకొని జయ
భేరి కొట్టుచు తిరిగెదం
వీరుల
పాదములు పూజించెదం

ఆమె మానవాకారాన్ని దాల్చి శశిని 'నాయనా' అని కౌగిలించుకుంది ఆమెతో పాటు ఆ మడుగులోని పాపలంతా ఎప్పటి మాదిరి రూపాల్ని పొందారు చందనరాజు పరుగెత్తుకుని వచ్చి చంద్రకళను క్షమాపణ వేడారు.

ఇదంతా చూసి ఆశ్చర్యపోయారు శశి. అప్పుడు ఆ కొలనులోని హంసలు జరిగిన కథంతా చెప్పి తాము దేవకన్యలమని చెప్పి మాయమైపోయారు. ఈ సంగతి తెలిసి ప్రజలంతా గుమిగూడారు చందనరాజు గారు తిరిగి యధారూపాన్ని పొందారని తెలిసి ఆశాలత ఆమె బృందమూ పరారై పోయారు.

చందనరాజుగార్కి అప్పటికీ ఇప్పటికీ అర్థమవటంలేదు భార్యపై భర్తకి ఎక్కువ ప్రేమా కొడుకుపై ఎక్కువ ప్రేమా అని. చందనరాజుగారు, చంద్రకళ అప్పటికీ ఇప్పటికీ ఒకరొకరు విడకుండానే వుంటున్నారు





# దయ్యంపట్టిన సీసా

శ్రీమతి కె. సరస్వతి

వాళ్ళు పోతున్న రోడ్డుకుప్రక్కనే ఒక పెద్ద బండ ఉంది. దానిమీద ఒక సీసా గంతులు వేస్తోంది. కొంతసేపు గిరగిర తిరుగుతోంది. మరికొంతసేపు అలా గిరగిర తిరుగుతూనే ఆ బండకు ప్రదక్షిణాలు చేస్తోంది. మరికొంతసేపు ఆ బండపైన ఎగిరెగిరిపడుతోంది. వంకరటింకరగా ఎగురుతోంది. రకరకాలుగా అల్లరి చేస్తోంది. ఈ అల్లరికి తోడు ఒక కీచుగొంతు సంగీతం వినవస్తోంది. ఆ సంగీతం సీసా వేసే గంతులకనుగుణంగా ఉంది.

ఈసంగీతం విని ఆగి నలుదిక్కులా చూశాడు, చెంచయ్య. ఎటునుంచి వస్తోందా ఈ శబ్దం - ఎవరు పాడుతున్నారా ఈ సంగీతం అని. ఇంతలో బండమీద గంతులు వేస్తున్న సీసా కనుపించింది చెంచయ్యకు. అంత ఎత్తునుంచి బండమీద పడుతున్నా ఆసీసా పగలకపోవటం, పైగా మళ్ళీదానంతటదే పైకి ఎగరటం ఇదంతా చూస్తే చెంచయ్యకు ఆశ్చర్యం వేసింది. నవ్వూవచ్చింది. "నాన్నా, నాన్నా ఆసీసా చూడు నాన్నా" అని ప్రక్కనే నడుస్తున్న తండ్రిని పిలచాడు. "ఏ సీసారా" అంటూ తండ్రి వీరయ్య ఆగి వెనక్కి చూశాడు.

నృత్యంచేస్తున్న సీసానుచూసి వీరయ్య కూడా చాలా ఆశ్చర్యపోయినాడు. బండ చుట్టూ తిరిగి చూసినా బండ కదిలించి, బండక్రింద చూసినా ఆ సీసా అలా ఎందుకు ఎగురుతున్నదో వీరయ్యకు అంతు బట్టలేదు. "కలియుగంలో ఇదొక వింత"అనుకున్నాడు వీరయ్య.

"ఆసీసాని పట్టుకో నాన్నా" అన్నాడు చెంచయ్య పట్టుకుంటే ఏమవుతుందో చూడాలనే ఆతృతతో. మొదట కొంచెం భయపడ్డా ధైర్యంచేసి సీసా రెండుచేతులతో పట్టుకున్నాడు వీరయ్య. వీరయ్య పట్టుకోగానే సంగీతం ఆగిపోయింది. సీసా కదలకుండా వీరయ్య చేతుల్లో ఇరుక్కుపోయింది. వీరయ్య మళ్ళీ బండమీద పెట్టగానే యథాప్రకారం నృత్యంసాగిస్తోంది. ఈ సారి వీరయ్య సీసా పట్టుకునిక్రింద నేలమీద పెట్టాడు. కాని సీసా ఒక్క గంతులో బండమీదకు పోయి నాట్యం చేయసాగింది.

"ఈ సీసా మన ఇంటికి తీసుకుపోదాం, నాన్నా" అన్నాడు చెంచయ్య. ఈ వింత తన స్నేహితులందరికి చూపించి తను గర్వపడాలని చెంచయ్య ఊహ.

"ఇంటి కెందుకురా ఈ సీసా" అని పనిగాడు వీరయ్య ఏదో అనుమానంతో. "నాకు కావాలి నాన్నా" అని గారాబం చేశాడు చెంచయ్య. పై పంచలో మూటగట్టాడు వీరయ్య ఆ సీసాని. సంగీతం ఆగిపోయింది. పది పదిహేను అడుగులు

## దసరా ★ శ్రీమతి గూడా సత్యవతి

| | |
|---|---|
| దసరా సెలవలు ఇచ్చారు, | బెల్లంపప్పులు తింటాము |
| దబదబ యింటికి వెడతాను. | చెల్లెలు బొమ్మలు పెడుతుంది |
| గిలకలబద్దలు పడతాను, | మంగళహారతు లిస్తుంది |
| గిరిజకు పక్కటియిస్తాను. | అక్కా బావా వస్తారు |
| పాటలుపాడుతు అందరము | అప్పచ్చులనూ తెస్తారు |
| పంతులుగారితో తిరుగుతము. | పంతులుగారికి రూపాయి |
| ఇంటింటికి మేం వెడతాము | మాకు తియ్యని మిఠాయి. |
| ఆశ్వీరధ్యానము చేస్తాము | పదరా తమ్ముడ వెడదాము |
| కొత్తబట్టలూ కడతాము | పరుగుపరుగునా పోదాము |
| కొత్తగిలకలూ పడతాము | పాఠాలన్నీ చదువుదము |
| సెలవులలోనా మేమందరము | పార్వతి పూజలు చేదాము |
| చేరివకచోట ఆడుతము | పండగరోజున అందరికీ జై |
| పాటలు పద్యాలు పాడుతము | పంతులుగారికి మరొక్క జై. |

వేశారో లేదో పైపంచెతోసహా విమానంవలె, గాలిపటంవలె ఎగిరిపోయి ఆ బండమీదనే నిలచింది. మళ్ళీ నాట్యం ప్రారంభించింది. ఇది చూసేసరికి చెంచయ్యకు భలే హుషారెక్కింది. వీరయ్యకు కూడా దీని సంగతేమిటో కనుక్కోవాలనే అభిలాష కలిగింది.

ఈసారి సీసాని రెండు చేతులలో గట్టిగా పట్టుకుని ఇంటికి తీసుకువెళ్ళాడు వీరయ్య. చెంచయ్య పోయి ఊళ్ళో అందరికీ చెప్పివచ్చాడు ఈ వింతవిషయం. అప్పటికే పొద్దుపోయినందున చూడాలని ఆశపడేవాళ్లకు "ఇవ్వాళ కాదు రేపు పొద్దున పదిన్నరకు" అని చెప్పాడు గర్వంగా చెంచయ్య.

ఇంటికి రాగానే సీసాని ఒక పాత ట్రంకుపెట్టెలో పెట్టి తాళంవేశారు. మళ్ళీ ఎక్కడ పారిపోతుందోనని పెట్టెమీద బరువు పెట్టించారు. సీసా కుక్కిన పేనలైనే పడిఉంది. సంగీతం లేదు గింగీతం లేదు.

వీరయ్య ఇంట్లో అంతా భోంచేసి పడుకున్నారు. వాళ్లకు ఇట్టే కునుకు పట్టిందో లేదో సీసా మళ్లీ సంగీతం ప్రారంభించింది. ఈసారి చుట్టుప్రక్కల ఊళ్లకు కూడా వినబడేటంత పెద్దగా ప్రారంభించింది. ట్రంకుపెట్టెను బాదుతున్నట్లు ధభీ ధభీ మని ఒకటే మోత. ఊళ్ళో జనం అంతా వీరయ్య ఇంట్లో మూగారు. ఆ రాత్రికి ఊళ్ళో ఎవ్వరికీ నిద్ర లేదు సీసా సంగీతంతో. అథం శథం ఎరుగని పిల్లలు మాత్రం అంత మోతలోనూ నిద్రపోయినారు. పెద్దవాళ్లంతా తలోకవిధంగా వీరయ్యకు సలహాలిస్తూ చర్చలతో రాత్రిఅంతా గడిపారు. భూతాచార్లుగారు మాత్రం ఆ సీసావిషయం తెల్లవారినతర్వాత జపంలో విచారిస్తానన్నారు.

తెల్లవారగానే సీసా అలసిపోయింది కాబోలు అల్లరి ఆపివేసింది. భూతాచార్లుగారు మాత్రం జపంనుండి లేవగానే "ఆ సీసాకి దయ్యం పట్టిం"దన్నారు.

అది విన్న దగ్గరనుంచి ఊళ్లో అందరికీ హడలు పుట్టింది ఆ దయ్యం ఆ సీసాను వదిలి వాళ్ళల్లో ఎవ్వరినైనా పట్టుకుంటుందేమోనని. అంతా దీనికి చెంచయ్యే కారణం అన్నారు. కొందరుమాత్రం "అయినా వీరయ్య కామాత్రం బుద్ధిఉండక్కర్లా, ఆ కుర్రకుంక మారాంచేస్తే మటుకు" అన్నారు.

వీరయ్యకేం తోచలేదు. ఎలా అయినా ఆ సీసాని వదిలించుకోవాలి అనుకున్నాడు. పెట్టె మూత తీస్తే అదే పారిపోతుందని పెట్టె తెరిచాడు. సీసా కదలలేదు. తీసి



శిశిరము

చి॥ పి. పద్మావతి (18 సం.) నెల్లూరు.

క్రింద నిలబెట్టాడు. అలానే నిలిచింది కాని సీసా కదలలేదు. ఆ సీసాను ఏం చేయాలో వాళ్ళకు తోచటంలేదు.

ఇంతలో అడుక్కోటానికి వచ్చిన ఒక సగం అరవ ముష్టివాడు "నూని పోసుకుందును, నాకియ్ సామీ" అని అడిగాడు వీళ్ళ సమస్యకు తాను సమాధానం చెప్తున్నట్లుగా. అంతే చాలునని వెంటనే ఇచ్చివేశాడు వీరయ్య, చెంచయ్యను అడగకుండానే. అంతా నిర్భయంగా పొలాలకు పనులకు వెళ్ళారు.

కాని ఒక గంటలోనే ఆ సీసా మళ్ళీ తిరిగొచ్చి వీరయ్య ఇంట్లోదూరి నాట్యం చేయసాగింది. సంగీతం పొలాల్లో పని చేసుకుంటున్న వాళ్ళకుకూడా వినబడింది. అంతా పరిగెత్తుకుంటూ వచ్చి చూశారు. సీసాను పట్టుకున్నారు.

ఈసారి సీసాను సముద్రంలో పారేయాలనుకున్నాడు వీరయ్య. వెంటనే కొన్ని మైళ్లు ప్రయాణంచేసిపోయి సముద్రంలో బలంకొద్దీ విసరివేశాడు వీరయ్య. కాని ఆ సీసా గాలిలో వెనక్కు తిరిగివచ్చి ఠపీమని వీరయ్య నెత్తిన పడింది. ఇక చేసేది లేక మళ్లీ ఇంటికి తీసుకువచ్చాడు సీసాని, వీరయ్య నెత్తిమీది బుడిపె తడువుకుంటూ.

ఈసారి ఎవరో 'సీసాను పాతిపెట్టితే సరి' అని సలహా ఇచ్చారు. వీరయ్య అది కూడా ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. ఎంతసేపటికీ గుంటలో సీసా పెట్టి మట్టిపోస్తే మట్టిమీదికి సీసా వస్తోంది కాని సీసామీద మట్టిపడటంలేదు. వీరయ్యకు విసుగుబుట్టింది.

వీరయ్య భార్య పిండివంటలుచేసి సీసాకు పూజలు పునస్కారాలు చేసి నైవేద్యాలు పెట్టింది. కాని సీసా అల్లరి మానలేదు.

చివరకు వీరయ్యకు దేవుడు గుర్తుకొచ్చాడు. ఇదంతా ఏదో దైవమాయ అనుకున్నాడు. ఆ సీసాకు సాష్టాంగప్రణామం చేసి 'ఓయి దేవుడా నన్నెట్లాగైనా కరుణించు' అని ప్రార్థించాడు.

అప్పటికి సీసాకి జాలికలిగింది కాబోలు. 'నేను ఎవ్వరికీ అపకారంచేయను నాకు కావలసింది స్వాతంత్ర్యం' అని సీసాలోనుంచి వినపడింది.

అది విన్న ఆవూరి పంతులుగారొకాయన ఆ సీసాను ఎక్కడనుంచి తెచ్చారో అక్కడే వదలిరావలసిందిగా వీరయ్యకు సలహా ఇచ్చాడు.

వీరయ్య తీసుకుపోయి ఆ సీసాను మళీ ఆ బండమీదనే పెట్టాడు. ఆ సీసా దొర్లుకుంటూ ఎగురుతూ ఆ ప్రాంతంలోని పొదలలోకి ఎక్కడికో మాయమైంది. ప్రతి నాలుగడులకి వెనక్కి తిరిగి చూచుకుంటూ వీరయ్య ఇల్లు చేరాడు.

ఆ తర్వాతకూడా వీరయ్య ఆ దోవన వెళ్ళటం సంభవిస్తే ఎవరో అతడిని చూసి ఎగతాళిగా నవ్వుతున్నట్లు వినవచ్చేది.

కథ కంచికి – మనం ఇంటికి.

## వానాలప్పలు

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఒళ్లంతా జలుజల్లనిపించే<br>
చల్లగాలి ఈలలతో పిలిచెను!<br>
పిల్లల్లారా! ఎల్లరు ముంగురు<br>
లల్లల్లాడగ రారండీ!<br>
ఆకాశంకొనలో చూశారా!<br>
అంబారీ ఏనుగ లవి గవిగో!<br>
జరీమెరుపు చిరుకుచ్చులు తళతళ<br>
మెరిసెను! రవ్వల మువ్వలతో!

వానమబ్బులే దసరాగిలకల<br>
తో నవ్విన వీనాడు!<br>
వానాలప్పలు తిరుగుదాముమరి<br>
వహవా! సెల విక నేడు!

తేగలు పరిగెడుతున్నాయని తూ<br>
నీగ లెగురుతున్నాయి!<br>
హోయి! హోయి! మనమాటలాడుదా<br>
మందరు తొందరగా రండీ!



# ఏటొచ్చే గోరువంక



ఆనాడు ఉగాది. బడితోటలో పిల్లలంతా సంతోషంగా సంబరాలు పడుతూ - పరవళ్ళు తొక్కుతున్నారు. వారి అందాల పూలగౌనులు, రంగురంగుల చొక్కాలు సంజె వెలుగులలో మెరిసి పోతున్నవి. గిరగిరా తిరుగుతూ చెమ్మచెక్కా చేరడేసి మొగ్గవేస్తున్న బాలికల గాజులు గలగలమంటున్నవి. ఉత్సాహంతో ఉల్లాసంగా కొందరు బాలురు చెడుగుడు ఆడుతున్నారు. బిళ్ళంగోడు ఆకాశంలో గింగిరాలు తిరిగేట్టు విరజిమ్మేస్తూ పందెము కాస్తోంది ఒక జట్టు.

అంతలో "చూడు! చూడు! ఆకాశంలో తమాషాగా ఎంతహాయిగా ఆపిట్టలు ఎగిరిపోతున్నవో! ఆ వింత చూడండర్రా" అని సుభద్ర అదాటుగా కేక వేసింది. ఆ కేక విని ఆడే ఆడే ఎక్కడి ఆట అక్కడే ఆపేసి నీలి మబ్బులవంక కన్నార్పక అగుపించే పిట్టల దండును చూస్తున్నారా పిల్లలంత.

ఎగిరే ఎగిరే ఓ పిల్ల పిట్ట పట్టు తప్పి నేల రాలింది. దానికి ఎగరటం ఏమంత బాగా అలవాటు అయినట్టులేదు. అది భయంతో గడగడ లాడసాగింది. అంజి దబదబా ఆ పసిపిట్టను చేతుల్లోకి తీసికొని "బాగా దెబ్బ తిని దిమ్మరపోయినట్టున్నదే పాపం!" అన్నాడు.

పిల్లమూక ఆ రాలిన చిన్న పిట్టచుట్టూ మూగారు. అదుర్దాగా పిట్టయెలావున్నదో అని ఆ పిల్లలు వంగి వంగి చూస్తున్నారు. అంతలో అంజి ఆ బుజ్జి పిట్టచుట్టూతా చేరిన పిల్లలను అదమాయించి అవతలకు నెట్టాడు. అతడు సుభద్రను పిలిచి "ప్రాణం ఉన్నట్టుందే దగ్గరకు తీసి సాకితే బతుకవచ్చు" ఇంద తీసుకో! అని ఆమె చేతికి అందించాడు.

అమాయికమైన ప్రేమా ఆనందమూ ఆపసిగుండెల్లో ఒక్కసారిగా తొణికిసలాడినై ఆ పిట్టను అందుకొంది సుభద్ర. మెరిసే ఆ చిన్నారి రెక్కలను నిమురుతూ ఏవేవో వచ్చీ రాని పాటలు పాడుతూ గంతులు వేస్తోంది.

"ఓపిట్ట! మాపిట్ట
అందాలపిట్టా!
నిన్ను చూసీ పూలు
కన్నీళ్ళు రాల్చాయి!
ఆ చిన్నికనులెత్తి
అటు చూడుపిట్టా"

సావాసగాళ్ళంతా ఆపాట అందుకున్నారు.

"చాలా జాగ్రత్తగా పట్టుకో, ఒత్తబోకు, నొప్పి పుడుతుంది అసలే అదిదెబ్బతిని వున్నది సుభద్రా!" అన్నదిహైమ. పిల్లలు పిట్టను ఇంటికి భద్రంగా తెచ్చారు. దానిని చూచి వాళ్ళఅమ్మ రాధ "ఇది బలే




గోరువంకే! అన్నది. ఆ డస్సిపోయిన పిట్ట పక్కలు ఊదింది. అరచేతులు రాచి వేడి వచ్చేటట్లు చేసింది. పిట్ట కదిలింది. కళ్ళు తెరిచింది. చేతిపైకి ఎక్కించి కాళ్లు కదిలించితే వేళ్లు గట్టిగా పట్టుకుంది. ఓ గిన్నెలో మంచినీళ్లుపోసి దానిముందు పెట్టారు. గింజలు కాసినితెచ్చి ఆ గోరువంక ముందు వెదచల్లారు. శాంతి, సుభద్ర, రాము, లక్ష్మి ఎప్పుడూ మోజుకొద్దీ ఆ పిట్టదగ్గిరే ఉండిపోయేవారు. ప్రొద్దస్తమానం దానిని చూస్తూ అన్నానికి రమ్మన్నా రాక మారాం చేసేవారు. రెప్ప ఆర్పకుండా అది కాళ్లు కదలించినా రెక్కలు విదలించినా అదోయిదిగా చూస్తూ కూర్చునే వారు.

**శ్రీ మద్దులూరి రామకృష్ణ**

ఆ పిట్టకు కాస్త ఓపిక వచ్చింది. నోరు విప్పింది. కిచకిచలాడింది. సత్తువవస్తే ఎగిరిపోతుందని గోరువంకను పంజరంలో పెట్టారు. ముద్దుగా రాము అరిసెముక్కదాని ముక్కులో కూరబోయాడు. అది చూచి సుభద్ర "ఒరేయ్! రామ్!! అది అరిసె తిందురా!" అని బర్రున ఆ ముక్క లాక్కుని నోట్లో వేసికొన్నది.

అంతటా వెదుకుతూ దిగులుగా అరచుకుంటూ ఓ పెద్దగోరువంక వచ్చి వారి దొడ్డి గోడపై వాలింది. ఆచూకీతీసి తన పిల్లను ఆనవాలు పట్టింది ఆ కన్నపిట్ట. ఎవరూ లేని సమయంచూచి పంజరంలో వున్న బిడ్డవద్దకు వెళ్ళింది. తల్లీ పిల్లా ఏమిటో కిచకిచమన్నవి. పిట్టా పిట్టా ముద్దు పెట్టుకొన్నాయి. దీనంగా మౌనంగా చూస్తూ తల్లిపిట్ట పోలేక, పోలేక ఎగిరిపోయింది. రోజూ, కన్నపిట్ట గోడపై వాలి కిచకిచలాడి పోతుండేది.

ఆటపాటల సరదాతో ఎన్నాళ్లో గడచిపోయినై. ఏరువాకపున్నమి వచ్చింది. బుల్లిపిట్ట ఓపిక కాస్త జాస్తయింది. ఎగిరే బలం వస్తున్నది. "వదిలితే ఎగిరి, దానియిష్టము వచ్చినట్టు కమ్మగా తిని, హాయిగా తిరుగుతుందిగదా!" అన్నాడు అంజి. అయితే దానిని గాలికి వదలడం ఆ చిన్నాళ్ళ కెవరికీ యిష్టంలేదు. అది యెక్కడికి పోతుందిలే, ఇక్కడే మన తోటలో నున్నమామిడిపై గూడుకట్టితే హాయిగా అందులోనే వుంటుంది. అన్నారు వారంతా.

ఆ పిల్లలందరూ కలిసి గూడుకట్టే అడావుడిలో పడ్డారు. అంజి అందరకూ పనులు పురమాయించాడు.

వాడు ఆ మామిడిచెట్టు చిటారుకొమ్మకు ఎక్కి ఒక గూడు కట్టాడు.

ప్రభ పంజరంలోని గోరువంకను తేలికగా నొప్పి తగలకుండా పట్టుకొని వచ్చి, ఆ కొత్త గూటిలో వదలబోయాడు. పట్టుతప్పి జారినట్టు జారింది ఆ పిట్ట. రెక్కలు తపతపా కొట్టుకుంటూ తొలకరి మబ్బుల్ని చూడపోతున్నదా అన్నట్టు ఎత్తుగా ఎగిరిపోతున్నది. ఒయ్యారంగా అది ఎగురుతూ వుంటే చూడముచ్చట అయింది. కంటి



పోలీసులు

చిత్రకారుడు: చి॥ యస్. నాగేశ్వరరావు (౮–ఏళ్లు)

కగపడనంతదూరం పోయిందాకా చూస్తున్నారా పిల్లలంతా. "తప్పించుకుని పోయింది, పాపం దానిగతి యేమవుతుందో" అని వాళ్లు ఎంతో దిగులుపడ్డారు. ఎక్కడికి పోతుంది! అందరిలాగా అదీ తన అమ్మవద్దకు వెళ్తుంది, అని అంజి అనేసరికి ఆపిల్లల చిన్ని మనస్సులు ఆనందంతో పొంగిపోయాయి.

బడికి పోయేటప్పుడల్లా ఉత్త గూడు చూచి ఆ పిట్టగతి ఏమయిందో, అది ఎలా వుందో అని కంట తడిపెట్టుకొనేవారు. ఈ యేడు కాకపోయినా వచ్చే ఏడాదికన్నా అది తిరిగివస్తుందనే ఆశతో సరిపెట్టుకొని వున్నారు.

చెట్లఆకులు పండి రాలిపోతున్నవి. చల్లని వసంతకాలం కమ్మని పూలవాసనలు మోసుకవచ్చింది. రకరకాల పిట్టలు కిలకిలలాడుతూ గుంపులు గుంపులుగా వచ్చి చెట్లనిండా వాలుతున్నవి. లేతమామిడి చివుళ్లుతిని నిండిన పొట్టలతో ఉల్లాసంగా చలాకిగా గంతులువేస్తూ కులాసాగా కూతలు వేస్తున్నవి.

ఓనాడు ఆ పిల్లలు చెట్టపట్టాలు పట్టుకుని కకపకా నవ్వుతూవుండగా ఆ గోరువంక వచ్చి సుభద్రగోడమీద వాలింది. అదేపనిగా ఆ పిల్లల ఆటలు చూస్తూ అక్కడే చిరుగంతులువేస్తూ కిచకిచమంటున్నదా పిట్ట.

సుభద్ర ఆ గోరువంకను చూచి గుర్తుపట్టింది. "ఇదేరా! ఇదే మనపిట్ట!" అని అందరనూ పేరుపేరున పిలిచి చెప్పింది సుభద్ర. పోయి పట్టుకోబోతే చేతిలోకి చిక్కినట్టే చిక్కింది. అరచేతిని ముద్దుపెట్టుకొన్నట్టు పెట్టుకొని రివ్వున లేచిపోయింది. వెళ్ళివెళ్ళి వారు కట్టిన గూటిలో తలదూర్చింది. అది కూస్తుంటే మంచిపాట పాడినట్టుండేది. దానినిచూచి పిల్లలు సంతోషంతో చప్పట్లుకొట్టారు.

ఆనాటినుండీ ఏటా చెట్టు చిగిర్చే కాలంలో చెలికాండ్రు కట్టిన గూటిలోకి వచ్చి కాపురముండేదా గోరువంక. వానలు జోరుగాకురిసే కాలంలో ఎక్కడికి పోయేదో ఎవరికీ తెలిసేదిగాదు. గజగజ వణకించే చలికాలం అయిపోగానే మరల ఆ గూటికి వస్తుండేది. "తంటాలుపడి బ్రతికించేవరకే మన పని, అటుపై దానియిష్టం వచ్చినట్టు హాయిగా ఎగురుతూ ఎక్కడెక్కడికో పోతూ వస్తూవుంటే చూడముచ్చటగా వుంటుంది." అని ఆ పిల్లలు ఇప్పటికీ అంటున్నారు. ★

# దేశం బాగుపడాలంటే

**★ శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి ★**

ఆవూళ్లో బళ్లో పిల్లలందరిలోను శేఖర్ అతి తెలివైనవాడని ప్రతీతి. దానినిబట్టి శేఖర్ అంటే మాష్టరుగారికే కాక ఆ వూళ్లో వాళ్లందరికికూడ అతి ప్రేమ; అతి చనువు. ఎప్పటికైనా మన వూరుకు పేరురావాలంటే మన శేఖర్ వల్లనే అంటూవుంటారు. శేఖర్ వయస్సుకూడ అట్టేలేదు. పది పన్నెండు సంవత్సరాలుంటాయి. మన పెద్దవాళ్లు కుశాగ్రబుద్ధి అన్న ప్రయోగము శేఖర్ విషయంలో అక్షరాల సరిపోయింది. అతని తెలివితేటలకు తోడు, పెద్దలపట్ల వినయము విధేయత, అతనిని అందలము మీదికి యెక్కించేసినాయి.

పిల్లలలో అనేకరకాలు వుంటారు కాబట్టి, కొంతమంది శేఖర్ నుచూసి అసూయపడేవారు, కొంతమంది ఆనందపడేవారు తయారయ్యారు. శేఖర్ మాత్రం వీళ్లందరిపట్ల వకేవిధంగా ప్రవర్తిస్తూ వస్తున్నాడు. ఇన్స్పెక్టరుగారువచ్చినా, డి. ఇ. ఓ వచ్చినా, ధాటిగా సమాధానాలు చెప్పేస్తాడు అనే ధైర్యం ఆ మాస్టారుగారికి కలిగింది. శేఖర్ లేకపోతే పెద్దవాళ్లచేత చివాట్లు తప్పేవికావు అని అనుకుంటూవుండేవాడు ఆ మాస్టరుగారు.

ఒకనాడు అనుకోకుండా ఇన్స్పెక్షన్ చెయ్యటానికి డి. ఇ. ఓ గారు వస్తున్నారని కబురొచ్చింది మాస్టారుగారికి. ఆయన వంటినిండా తేళ్లు ప్రాకినట్లయింది. వెంటనే శేఖర్ ను పిలిపించి యీ విషయముచెప్పి మన స్కూలుగౌరవము అంతా నీ చేతిలోవుంది. ఎట్లా నిలపెడతావో అంటూ జాలిగా అడిగాడు. 'ఏం ఫరవాలేదండి మాస్టారుగారూ ఏ ప్రశ్నలు యిచ్చినా సమాధానాలు చెప్పేస్తాను' అంటూ ధైర్యంగా సమాధానం చెప్పాడు శేఖర్. మాస్టరుగారుచాలాసంతోషించాడు.

మర్నాడు ఇన్స్పెక్షన్. పిల్లలందరు ప్రొద్దున్నే లేచి, సూర్యోదయం కాకముందే, ముఖప్రక్షాళన, స్నానాదులు పూర్తిచేసుకొని, అమ్మ పెట్టిన వేడి వేడి అన్నం కడుపునిండా తిని, బళ్లోకి బయలుదేరారు, లేత కిరణాలు ముఖాన పడుతుంటే ముఖాలు చిట్లించుకుంటూ. శేఖర్ తల్లికి నమస్కారం చేసి బయలుదేరాడు బళ్లోకి.

డి. ఇ. ఓ గారు మాస్టరుగార్ని స్కూలుకు సంబంధించిన కొన్ని ప్రశ్నలు వేసిన తర్వాత, యిక పిల్లలను ప్రశ్నలు వెయ్యటానికి పిల్లల గదిలోకి వచ్చాడు. అందరు నుంచొని జైహింద్ అంటూ ఆయనకు స్వాగతం యిచ్చారు. ఆయన చాలా సంతోషించి, పిల్లల క్రమశిక్షణకు మాస్టరుగారిని అభినందించాడు. మాస్టరుగారికి సగంబలం చేకూరింది. ఇక డి. ఇ. ఓ గారు ప్రశ్నలు వెయ్యటం ప్రారంభించాడు. భూమి యెట్లా వుంటుంది అనే పాతకాలపు భూగోళపు ప్రశ్నదగ్గరనుంచి, మన దేశము

## భావిపౌరులకు బాపూజీ సందేశం

"ఏనాటికో ఒకనాటికి చనిపోవటానికే మనమంతా బ్రతుకుతున్నాం. చచ్చిపోయాక కూడా మళ్లీ మనమందరమూ జన్మ లెత్తుతాం. ఈ విషయాన్ని మనం బాగా గుర్తువుంచుకొన్నంతవరకు జనన మరణాలవల్ల మోద ఖేదాలు పొందటం అనవసరమని అవగతమౌతుంది. కాబట్టి మన మందరమూ చావు బ్రతుకులను గూర్చి ఆందోళను విడనాడి, యీ జన్మలో మనచేత ఏ పని చేయించాలని ఆ విధాత మనను యీ భూమి మీదికి పంపాడో, ఆ పనిని ఆజన్మాంతం చేస్తూ వుండటమే మన కర్తవ్యం' మీమీ కర్తవ్యం ఏమిటో తెలుసుకోవాలనుకుంటే అందుకు మీ ఆత్మలే సాక్షి. మీ ధర్మాన్ని మీరొకసారి గుర్తిస్తే యిక ఆ మార్గాన్ని విడనాడకండి. మీ బాధ్యతలను నెరవేర్చటంలో బద్ధకించకండి. ఆ విధంగా మీరు మీ బాధ్యతలను నెరవేర్చటం నేర్చుకొన్నాక, - నేనిక యీ భూమి మీద లేనన్న వార్త విన్నాక కూడా - మామూలుగా మీరాడుకొనే ఆటలు ఆపకుండా ఆనంద పారవశ్యంలో తేలియాడగల స్థితిని పొందగలుగుతారు. 'నేనికలేనన్న వార్త విన్నాక కూడా మీరు చేస్తున్న పని ఆపివేయకుండా, ఆడుతున్న ఆట విరమించకుండా వుంటే నేను లేకుండా పోయానన్న ఆ మాటకే అర్థం లేకుండా పోతుంది. మీరంతా ఆ విధమైన ఆత్మ సంస్కారాన్ని అలవరచుకోగలరని ఆశిస్తున్నాను."

మన ప్రెసిడెంట్ యెవరు అనే రాజకీయపు ప్రశ్నదాక, విధి విరామం లేకుండా, డి. ఇ. ఓ గారు ప్రశ్నలవర్షము కురిపించారు. మధ్య మధ్య మాస్టరుగారు కూడా అడ్డు పడుతూ వచ్చాడు. ఈ ప్రశ్నలకు కొంత మంది బాగానే సమాధానాలు చెప్పారు అని డి. ఇ. ఓ గారు సంతోషపడ్డారు. దానినిబట్టి మాస్టరు గారికి సంతోషంగానే వుంది.

చివరకు డి. ఇ. ఓ గారు ఒక కాగితము తీసుకువచ్చి, పిల్లలందరిని సంబోధిస్తూ 'ఓ అబ్బాయిల్లారా! ఈ కాగితము అందరు చూశారుకద. దీని మీద ఒకవైపు మన హిందూదేశపటము వుంది. మాడండి ఎన్ని పర్వతాలో ఎన్ని నదులో ఎన్ని పట్టణాలో! ఎంత పెద్దదేశ మనుకున్నారు మనది! రెండవవైపు చూశారా మీమాదిరే ఒక అబ్బాయి. అందరు చూశారు కదూ. ఇప్పు డొక తమాషా చేస్తాను. ఏమి టంటారా! ఈ కాగితాన్ని యిప్పుడే మీ యెదటే చించేస్తున్నాను ముక్కలుముక్కలుగా. మళ్ళీ మీరు యథాప్రకారంగా ఆ కాగితాన్ని, ఆ ముక్కలు అన్నీ సరిగ్గా అతికించి అదివరకు వున్నమాదిరిగా వుంచాలి. అంటే మళ్లీ మనదేశము, ఆ అబ్బాయి స్పష్టంగా కనిపించాలన్నమాట. ఎవరన్నా చెయ్యగలరా?' అని అడిగాడు.

అమ్మో! ఇన్ని ముక్కలు యెట్లా అతికించగలమండీ అంటూ ఒక అబ్బాయి. ఈ ముక్కలన్నీ అతికించినా కూడ అదివరకు మాదిరిగా వుండదని ఒక అమ్మాయి. రెండు మూడు రోజులు వరసగా కూర్చుని అతికిస్తే సరిగ్గా వస్తుందని యింకొకడు. యీ విధంగా తలోక రీతిగా సమాధానం చెప్పటం మొదలుపెట్టారు. అందులో మోహన్ అనే ఒక తెలివైన పిల్లవాడు నేను చేస్తానండి సరిగ్గాను అని ఆ కాగితపు ముక్కలన్ని తీసుకొని, హిందూదేశపు పటములోని, ముక్కలన్ని అతికించటం మొదలుపెట్టాడు. హిమాలయపర్వతాల దగ్గరవున్న కాగితంముక్క పడమటి కనుముల దగ్గర పెట్టాడు. ఎంతసేపటికి సరిపోవటం లేదు. కావేరీనదిదగ్గర చించిన కాగితంముక్క గంగానదిదగ్గర అతికించితే అతుకుతుందా! సతమతమయిపోతున్నాడు. ఎంతసేపటికి కుదరటం లేదు. విసుగు పుట్టి ఇక లాభంలేదండి. ఈ దేశం సరిగ్గా రాదండి అనే నిర్ణయానికి వచ్చాడు.

ఈమాట అనంగానే శేఖర్ గభాలున లేచి నుంచుని ఈ దేశాన్ని సరిగ్గా నేను అతికిస్తానన్నాడు., మాస్టరుగారు పరమానంద భరితుడయ్యాడు. డి. ఇ. ఓ గారు ఆశ్చర్యంగా చూశాడు.



'ముందర ఆ అబ్బాయిని సరిగ్గా పెడితే దేశం దానంతట అదే సరిగ్గా వుంటుందండి' అన్నాడు శేఖర్.

ఈ మాటల్లో గంభీరమైన భావం వుంది మీరు గ్రహించారా అన్నాడు డి. ఇ. ఓ. మాస్టరుగారిని. తెలియదంటే యెక్కడ తన తెలివి తక్కువ బైటపడుతుందో అని గ్రహించానంటూ తల తోలుబొమ్మలాగ త్రిప్పేశాడు. మాస్టరుగారి గౌరవము దక్కే యోగ్యత వుందికాబోలు, డి.ఇ. ఓ. గారు మళ్లీ ప్రశ్నించలేదు.

'అదెట్లా సాధ్యమవుతుంది?' అంటూ డి. ఇ. ఓ. శేఖర్‌ని ప్రశ్నించాడు.

అప్పుడు శేఖర్, 'మా అమ్మ నాకు చెప్పిందండి. ముందర మనం మంచి పిల్లలుగా తయారవ్వాలి. అప్పుడు, నెహ్రూ అంత అవుతారట. తర్వాత దేశం దానంతట అదే బాగుపడుతుందిట. ముందరే, మనం బాగా తయారవక మునుపే దేశాన్ని సరి చెయ్యాలంటె కుదరదుటండీ. అందువలన ముందర నేను యీ అబ్బాయిని సరిగ్గా అతికిస్తే దేశం దానంతట అది సరిగ్గానే వస్తుందని చెప్పానండి' అన్నాడు.

'శభాష్! చాలా బాగుంది. ఇన్నిస్కూళ్లు తిరిగాను గాని యిలాటి అబ్బాయిని యెక్కడా చూడలేదు.' అంటూ డి. ఇ. ఓ. ప్రత్యేకంగా ఒక మంచి బహుమానాన్ని శేఖర్‌కు యిచ్చాడు.

అందువలన, దేశం బాగుపడాలంటే, మనిషి బాగుపడాలి. మనిషి బాగుపడాలంటె, అందరికి శేఖర్ తల్లివంటి తల్లులు వుండాలి. తల్లులవల్లనే కద పిల్లలు బాగుపడాలిసింది. ఏమంటారు? ★



# "జయవిజయీభవ!

"పాండవులేపాండవులే తుమ్మెదా!
పంచా పాండవులే తుమ్మెదా -
ఆలి పాంచాలితో తుమ్మెదా
అడవులా పాలైరి తుమ్మెదా."

దసరా పండుగ వచ్చిందంటే చాలు. వాకిట్లోకి వచ్చే హరిజన దాసరులకు లెక్కలేదు. కొయ్యకిరీటములు తలకు తగిలించుకొని ఒక రాజువేషం, ఒక రాణీవేషం వస్తుంది. కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, యీ హరిజన దాసరులు బాగా వల్లించిన నాటకంలోని కీర్తనలు పాడతారు. "రాజాధిరాజా! రాజానరేంద్ర! నే తాళజాలరా! నే నోర్వజాలరా!" అని రాణీ వేషం వేసినవాడు చిందు తొక్కుతాడు. "ఓ ప్రాణనాయికీ!—ఓ లలనామణీ!

వేటాడ వెడలెద—
వేగామె వచ్చెద—
సాటి పుత్త్రిడు నీకు
సారంగధరు డంటె—
చింతా వలదింక
చిత్రాంగితో నీకు

వేటాకు వెడదాద
వేగాము వచ్చెద

తధికిణతోం!
తధికిణతోం!

ఈవిధంగా ఒకడు తాను రాజ రాజ నరేంద్రుణ్ని అని తానే చెప్పుకొని పాట పాడుతాడు. ఇంకొకడు తానే చిత్రాంగి మహారాణిని అని చిందులు త్రొక్కుతాడు. కొంతసేపు యీవిధంగా చిందులు తొక్కిన తర్వాత, "ఏమండి దొరగారు! ఏడాదికోసారి వేము వచ్చేది. మీపాలేరు సుబ్బడి తమ్ముణ్ని - పండగ మామూళ్లు దయచేయించండి దొరగారూ!" అని అసలు సంగతి బయటపెడ్తాడు.

ఇంతకూ రాజరాజనరేంద్రుడు ఎవ్వడో యిప్పుడు బయటపడింది అప్పుడు కరణం గారు రాజరాజ నరేంద్రుడికీ, చిత్రాంగికీ కలిసి ఒక అర్ధరూపాయి యిచ్చి, "ఇచ్చిందేదో తీసుకోండి! ఇక వెళ్లండి" అంటాడు.

వీళ్ళు వెళ్ళిన తర్వాత మరి కొందరు హరిజన స్త్రీలు, అనగా మాతంగ కన్యలు





యువతులు మెడలనిండా గంధం పూసికొని, నొసటినిండా కుంకం పెట్టుకొని,

“పాండవులే పాండవులే తుమ్మెదా
పంచా పాండవులే తుమ్మెదా”

అని పదిమందీ కలిసి ఒక్కటే గొంతుకతో చెవులు చిల్లులు పడేటట్లుగా పాడుతూ వాకిట్లోకి వస్తారు. పాండవుల అరణ్యవాసం కధ, అజ్ఞాతవాసం కధ, వీళ్లు ఒకటే చాంతాడులాగున పాడతారు. తుమ్మెదలతో ఈ కధ తాము చెప్తున్నట్లుగా, తుమ్మెదలులాగున వాకిట్లో ముసురుతారు. వాళ్లకు ఒక కుంచెడు వడ్లు కొలిచిపోస్తేనే తప్ప మంచి మాటలతో గాని, తియ్యని కబుర్లతో గాని కదలి వెళ్లరు. ఈవిధంగా, తుమ్మెదలు పువ్వుల మీద వాలి తేనెను పీల్చుకొని పోతున్నట్లుగా, యీ హరిజన భ్రమరాంబలు ఊరంతా తిరిగి సూర్యుడస్తమించేలోపుగా అర బస్తా వడ్లయినా చేర్చి అందరూ పంచుకుంటారు.

వీళ్లకంటె ఎక్కువ కోలాహలంగా కోలాటాలు వేస్తూ కొత్త చొక్కాలు తొడుక్కొని బడి పంతులు వెంట బడిపిల్లలు బయలు దేరుతారు.

“సీతారాముల నీతిచరిత్రము
ఖ్యాతిగ వినరన్నా!
ప్రఖ్యాతిని గనరన్నా!”

అని పాడుతూ కోలాటాలు వేస్తారు. ఇంటి గుమ్మంలోకి వచ్చి కోలాటం అయిన తర్వాత “దాన రాధేయ! దీనమందారా!” అంటూ గృహస్థుని స్తోత్రం చేస్తారు. ఆఖరుకు ఇదంతా ఎందుకయ్యా అంటే,—

“అయ్యవారికి చాలు అయిదు వరహాలు
పిల్లవాళ్లకు చాలు పప్పుబెల్లాలు”

అనే పాట ప్రారంభిస్తారు. వరహా అంటే కరకు వరహా అని ఎంచి, నాలుగు రూపాయలు చొప్పున లెక్క చూచినప్పటికీ అయిదు వరహాలంటే రూ 20 లు అయింది. బడిపంతులుకు రూ 20 లు చాలునని అర్థం—అంటే, గ్రామం మొత్తం మీద రూ 20 లు వసూలు అయితే బడి పంతులుగారికి చాలునేమో! ఇంటింటికీ, రూ 20/లు చొప్పున కావలెనంటేమాత్రం అట్లా కనక వర్షం కురుస్తుందా?

పిల్లవాళ్ళకు మాత్రము సెనగపప్పు, బెల్లము పొడి కలిపిపెట్టితే సంతోషించి వెళ్లిపోతామని పాటపాడుతారు. ఈ దసరా పండుగ యీనాముల కోసం యింటికి వచ్చే టటువంటి జనులు అనేక రకాలుగా ఉంటారు. అనేక రేట్లు ప్రకారంగా మామూళ్ళు, యీనాములు, చందాలు, వార్షికాలు వసూలు



# దిగ్విజయీభవ!”



# బాలకుల దీవెనలు-

[బడిపిల్లలు యింటి యజమానికి ఎదురుగా నిలువబడి.........]

పరగ నాశ్వీజ శుక్ల
    పక్షంబునందు
తెరగొప్ప దీవించ
    వస్తిమిట మేము
శ్రీరస్తు విజయోస్తు
    దీర్ఘాయు రస్తు
భూరివైభవ మస్తు
    పుత్రలాభోస్తు
ధీరస్తు విజయోస్తు
    దీర్ఘాయు రస్తు
ధన కనక వస్తు వా
    హన సిద్ధిరస్తు
కారుణ్యముగ మీకు
    కల్యాణ మస్తు

*    *    *

ఆశ్వీజ శుద్ధ మహా
    ర్నవమి గాన
బాగుగా దీవించ
    వస్తి మిటు మేము
బాలకుల దీవెనలు
    బ్రహ్మ దీవెనలు
చాల సంతోషులై
    సరసు లయ్యెదరు
శ్రీమంతులై మహా
    శ్రేయములు గల్గి
భూమిలోపల లేని
    భోగములు గల్గి
బహుకీర్తి సంపదలు
    బడయంగ గల్గి
కొడుకులును కోడండ్రు
    కొమరప్ప గల్గి

సతులతో సుతులతో
    సౌఖ్యములు కల్గి
పడుగులును పెండ్లిండ్లు
    వరుసతో గల్గి

*    *    *

ఏడాది కొకదినము
    వేడుకతో మేము
పొడిమిగ మిమ్మిట్లు
    పొగడ వచ్చెదము

*    *    *

అయ్యవా రొచ్చెనని
    అనుమానపడక
నయగారి మాటలని
    నగుచు పొమ్మనక
రేపురా మాపురా

ఇల్లెండ్రవలె గాదు
    చెలగి మిమ్మడుగ

*    *    *

నిలువుజీతము గాదు
    నిలిపి మిమ్మడుగ
పాతప్పలును గావు
    పలుమారు అడుగ
కొత్తప్పలును గావు
    కోరి మిమ్మడుగ
ఖ్యాతిగా మాకిస్తె
    ఘనకీర్తి యగును
ఇవ్వని లోభి వా
    రిండ్లకును బోము
వెయ్యార్లు ఏమైన
    వేడేది లేదు.
అయ్యవారికి చాలు
    అయిదు వరహాలు
పిల్ల వాండ్లకు చాలు
    పప్పు బెల్లాలు

# బ్రహ్మదీవెనలు ★

    మళ్ళి రమ్మనక
యీసారి పొమ్మనక
    తిరిగి రమ్మనక
వరుసతో మీవంటి
    దా రెండ కనక

*    *    *

పలుమారు మిమ్మెపుడు
    అడుగంగ రాము
రాత్రైన కరగించి
    రా కోరగలము
అల్లుండ్లవలె గాదు
    అలిగి మిమ్మడుగ.

ఏదయా మీ దయా
    మామీద లేద?
శీఘ్రముగ పంపుడీ
    శ్రీమంతులార
శ్రీరస్తు మీకెల్ల
    దిగ్విజయ మస్తు
ఆయు రభివృద్ధ్యస్తు
    ఐశ్వర్యమస్తు
యిష్టఫల సిద్ధ్యస్తు
    వృద్ధికర మస్తు
జయాభిక్షై భవ!
దిగ్వైజై భవ !

**PUJA CONCESSION**
LESS THAN Half Price
for 15 DAYS ONLY

WRIST WATCHES MADE IN FAMOUS SWISS FACTORIES EACH GTD. 10 YRS.

RAILWAY POCKET WATCH. 11/-
SUPERIOR QUALITY... 13/-
ALARM TIME PIECE... 13/-
No 525 SIZE 6¾ RECT SHAPE
15 JEWELS ROLLED GOLD. 40/-
15 J. R/G 10 MICRONS 45/-
No 536 SIZE 8¾ WATERPROOF SHOCKPROOF
15 JEWELS STEEL CASE 38/-
17 JEWELS STEEL CASE 42/-
No 537 SIZE 6¾ FLAT SHAPE
15 JEWELS CHROME... 34/-
15 JEWELS ROLLED GOLD 36/-
ONE WRIST WATCH FREE ON ORDER OF THREE
ONE POCKET WATCH ON ORDER OF TWO
ONE GOLD CAP F. PEN ON ORDER OF ONE

**H. DAVID & Co.**
POSTBOX No 11424. CALCUTTA

## నపుంసకతైలం

అంగ, నరములు బలహీనతచెంది చిన్నదైన, తిరి యథాప్రకారమై పూర్తి సౌఖ్య మనుభవించుటకు 48 ఏండ్లు ప్రఖ్యాతిచెందిన గ్యారంటీమందు. 1 సీసా రూ 10/- వి. పి. రూ 1-0 0.

## గర్భనిరోధిని

అనేక వేలమందిచే వాడబడి, నమ్మకంగా గుణంయిచ్చినదని నిర్ధారణ అయినమందు. సంతాన నిరోధమునకు ప్రభుత్వంవారుకూడా ప్రచారముచేయుచున్నారు. శరీరారోగ్యమునకు ఏమాత్రం భంగంలేని 48 సంవత్సరముల ప్రఖ్యాతి గలమందు. స్త్రీలు బహిష్టు సమయములో సేవించిన యికమీదట గర్భమురాదు. 1 సీసా రు 10/-లు. వి. పి. ఖర్చు రు 1/- కావలసినవారు రు 1/- ముందుగా పంపేది.

డాక్టర్ రత్నం సన్సు మెడికల్ హాల్,
మలకపేటబిల్డింగ్సు. హైదరాబాదు (దక్కన్)

# జయ విజయీభవ!

చేసికొనిపోతూ ఉంటారు. కాని, బడిపిల్లలు మాత్రము పప్పు బెల్లాలకోసమే వచ్చాము అనిస్పష్టంగా చెప్పి, హాయిగా కొంచెం సేపు చక్కని పద్యాలు చదివి పాటలు పాడి కోలాటాలు వేసి వెడ్తారు. అందుకని, ఏ యింట్లోనైనా సరే యీ దసరాపండుగలో పిల్లలు అంటే సరదా ఎక్కువ—ఎందుచేత? అని అడగండి. ఈ పండుగకు అందరి కంటె పిల్లలు కోరేది స్వల్పం. అటువంటి పిల్లలు వృద్ధిలోకి రావాలనే పెద్దవాళ్ళు యీ దేవీపూజలు చెయ్యాలి.

అంతే కాదు. చిన్న పిల్లలవంటి హృదయం ఉంటేనే భగవంతుణ్ని మెప్పించడానికి వీలవుతుంది. "ఎవరైనా సరే వైకుంఠంలోనికి వెళ్ళాలంటే చిన్న పిల్లలవలె ఉండాలి" అని ఏసుక్రీస్తు ఒక పర్యాయం తన శిష్యులతో అన్నాడు. కాని, పిల్లలకు ఉండే కోరిక ఏమిటంటే, "నేను త్వరగా పెద్దవాడిని కావాలి. నాన్న అంత ఎత్తు పెరగాలి. అన్నయ్య అంత పెద్దవాణ్ని కావాలి. అప్పుడు నేను ఒక్కణ్ని స్వయంగా సైకిలుత్రొక్కుతూ ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్ళవచ్చు" అని ఈవిధంగా చిన్నపిల్లలు కోరుతూ ఉంటారు.

తోక లేకపోయినా హనుమంతుని అంతవాడు కావాలనీ, ఒక్కసారిగా సముద్రం దూకి వెళ్ళాలనీ కోరిక ఉంటుంది. నిజమే—హనుమంతుని అంతవాళ్లు కావడం చాలా మంచిది. హనుమంతుడు ఒకొక్కప్పుడు బ్రహ్మాండంగా పెరిగి ఆకాశమంతా ఆక్రమించేవాడు. ఆయన తోక అనేక మైళ్ళ పొడుగు పెరిగేది. "జయ్! సీతారాం!" అని ఒక్కసారిగా ఆకాశంమీద ఎగిరి సముద్రం కూడా దూకి వెళ్ళాడు. కాని, యీ హనుమంతుడే తిరిగీ చిన్నకోతిగా ఉండి కొమ్మల సందున కూర్చుండేవాడు. పండ్లు మాత్రమే తినేవాడు. హనుమంతుడు ఎన్నడూ కాఫీ తాగలేదు. టీ తాగలేదు. సిగరెట్లు, బీడీలు కాల్చలేదు. రాములవారితో కలిసి అయోధ్యా నగరానికి వెళ్లినప్పుడు కూడా ఆ మహానగరంలో ఒక్కనాడైనా కాఫీ హోటలుకు వెళ్ళలేదు. "పిల్లవాళ్లకు చాలు పప్పుబెల్లాలు" అన్నట్లుగా జామపండ్లు, సపోటాపండ్లు, మామిడిపండ్లు, కొబ్బరి ముక్కలు, అరటిపండ్లు మాత్రం తినేవాడు. అన్నింటికన్నా ముఖ్యంగా హనుమంతునకు సీతా అమ్మవారంటే, రాములవారంటే ఎక్కువ భక్తి ఉండేది. అందుకని సీతా అమ్మవారికి నైవేద్యం పెట్టి సీతాఫలం తినేవాడట. రాములవారికి

## అతిమూత్రవ్యాధి వారం రోజులలో నెమ్మదించును

మూత్రంలో అధికంగా చక్కెరపోవుటను అతిమూత్రవ్యాధిఅంటారు. (Diabetes) ఇది యెంత ఉపద్రవకరమైన వ్యాధిఅంటే, దీని పాలబడినవారు ఆరోజు కారోజు మృత్యువుకు ఆసన్నమౌతుంటారు. దీనికి డాక్టర్లు ఇన్‌సులిన్ ఇన్‌జెక్షన్ మాత్రమే కనిపెట్టారు. వాటివల్ల వ్యాధి పూర్తిగా నయం కానేకాదు. ఇన్‌జెక్షన్ల గుణము వున్నంతకాలం మాత్రం చక్కెర తాత్కాలికంగా నిలిచిపోతుంది. ఈజబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి దాహం, ఆకలి, తరచుగా చక్కెరతో మూత్రం బయలు వెడలటము, దురద మొదలైనవి ఈ వ్యాధి ముదిరితే రాచ పుండు, కురుపులు, కంటిపొర ఇతర చిక్కులు సంభవించును. వీనస్ ఛారమ్ ఆధునిక శాస్త్రంలో అద్భుతమైన చికిత్స. దీన్ని వాడటం వల్ల వేనకు వేలమంది మృత్యుముఖంనుండి బయటపడ్డారు. దీన్ని వాడితే రెండవ లేక మూడవ రోజునుండే మూత్రంలో చక్కెర తగ్గించి అత్యధికమూత్రం గూడ నివారిస్తుంది. మూడు రోజుల తరువాత మీకు బాగా తేలిక యిస్తుంది. దీనికి పత్యం లేదు. ఇన్‌జెక్షన్లు అవసరం లేదు. ఇంగ్లీషులో వివరములుగల కరపత్రానికి వ్రాయండి. ఉచితంగా పంపుతాము.

50 బిళ్లల బుడ్డి ఖరీదు రు. 6-12-0 లు
ప్యాకింగు పోస్టేజి ఉచితము

వీనస్ రీసెర్చి లేబరేటరీ,
పోష్టుబాక్సు నం. 587. కలకత్తా (A. P. W)

## నారసింహలేహ్యము




బంగారు చేర్చబడినది. మేహము, నిశ్శక్త, విస్మృతుల, శుక్లనష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

20 తు॥ డబ్బి రు. 8-4-0 పోస్టేజి 12 అ.
పి సి. ఎ. శ్రీకంపెని. "ఆయుర్వేదసమాజం"
పెరిదేపి-నెల్లూరు జిల్లా.

గనోక్వెల్
అన్నిసెగలకు గంటలలోగుణము
ఈశ్వరఫార్మశి రాజమండ్రి.

## జయము విజయీభవ!

నైవేద్యం పెట్టి రామాఫలం తినేవాడట. కాని, మనం యిప్పుడు యీ కాలంలో అటువంటి రాములవారినీ పూజించాలి, అటువంటి సీతా అమ్మవారినీ పూజించాలి. వారిద్దరినీ భక్తితో పూజించిన ఆంజనేయులవారినీ పూజించాలి. కనుక, మనము సీతాఫలం, రామాఫలంమాత్రమే కాకుండా సీతారామాంజనేయఫలం ఏదో తెలిసికొని దానిని కూడా నైవేద్యం పెట్టి తినడం మంచిది. సీతారాముల చరిత్రం రామాయణంలో ఉంది. అందులో ఉండే తియ్యనికథలు చదువుతుంటే ఆంజనేయులవారి గొప్పతనం అంతా అర్థమవుతుంది. ఆయనలో ఉండే గొప్పతనం మాత్రమే కాకుండా, ఆయనలో ఉన్న కొద్దితనంకూడా అర్థంచేసుకోవాలి. ఆయన స్వభావం మనం బాగా అర్థం చేసుకోవాలి. ఆంజనేయులవారికి ఆయనలో ఉన్న శక్తి ఆయనకే తెలియదు. రాములవారి పేరు వింటే పొంగి ఉప్పొంగి పోతాడు. శ్రీరాములవారి ఆజ్ఞ అయితే చాలు. ఎంత పని అయినాసరే, రాములవారి యందున్న భక్తి ఆవేశంవల్ల చేసేవాడు. సంజీవి పర్వతాన్ని ఉన్నది ఉన్నట్లుగా ఎత్తుకొని వచ్చాడు. సీతా అమ్మవారు లంకలో ఉన్నదేమో చూచి రావయ్యా అని రాములవారు అతన్ని పంపిస్తే, లంక అంతా కాల్చి వచ్చాడు. చూచి రమ్మంటే కాల్చి రావడం ఎందుచేత? రాములవారు తనకు జీతం హెచ్చుచేస్తారనే ఆశచేతకాదు. ఆవేశంచేత చేశాడు - కొంతమంది నవ్వు కర్లు అల్లా చెయ్యరు. పనిచెప్పితే, పాతిక వట్టం అంటారు. చెప్పిన పనిలో నాలుగో వంతు తక్కువగా చేస్తారు. ఆంజనేయులవారికి రామభక్తి ఆవేశం కలిగితే బ్రహ్మాండమైన బలం వచ్చేది. ఆ బ్రహ్మాండమైన బలంతో "గడ్డతో పెరికి లంకయు దెచ్చెద.......

రావణుబట్టి దెచ్చెదను
రాముని సన్నిధి కెన్ని రీతులన్"

అని రాములవారితో అన్నాడు. రావణాసురుని లంక అంతా ఒక్కటే గడ్డగా పెళ్ళగించి తీసికొని వస్తాను అని రాములవారి యెదుట ప్రతిజ్ఞ చేశాడు. రావణాసురుని తన తోకతోనే బంధించి తీసికొని రాగలిగినవాడు. అటువంటి బ్రహ్మాండమైన బలశాలి రాములవారి యెదుట చేతులు జోడించుకొని పిల్లికూనవలె కూర్చుండేవాడు. రామభక్తి ఆవేశంచేత తనకు అసాధ్యమైన పని లేదు అనేవాడు. తనలో రామభక్తి లేకపోతే తనకు ఏమీశక్తిఉండదని గ్రహించి, రాములవారి పాదాలను సదా పూజాచేస్తూ, తాను ఆయన పాదానికి అంటుకొనిఉన్న ఒక చిన్న నలకవంటివాడను అనేవాడు.

ఆ రాములవారియందున్న భక్తి ఆవేశంచేతనే "రామా! నీ సమానమెవరు?" అని కీర్తనలు పాడుతూ, "నీ దయలేకపోతే నేనెందుకు పనికివస్తాను? స్వామీ!" అనేవాడు. "ఏమీచేసితేనేమి? స్వామీ కరుణలేని వారిలలో" అని త్యాగరాజులవారిలాగున కీర్తనలుపాడుతూ ఉండేవాడు. భగవంతుని యెదుట తాను చిన్నపిల్లవానిలాగున నమస్కారం చేస్తూ కూర్చుండేవాడు.

ఒక పర్యాయము భీముడికీ ఆంజనేయులవారికీ కుస్తీవచ్చింది. వీరిద్దరూ వాయుదేవునికి కొడుకులే. హనుమంతుని తోక కదిలించలేక భీముడు తోక మడత పెట్టవలసి వచ్చింది.

సీతా అమ్మవారిని రక్షించడంకోసమే


రుచికరమైనవి నర్గీసి కబాబ్

ఈ విధముగా సులభముగా జేయవచ్చును:

ఒక గిన్నెడు శెనగపప్పును రాత్రియంతయు నానబెట్టండి. తరువాత ఈ శెనగపప్పును ఒకపౌను చిన్నచిన్న మాంసపు ముక్కలు, పచ్చి మిరపకాయలు, కొన్ని మిరియపు గింజలు, కొత్తిమీర, కారపుపొడి, లవంగాలు, దాల్చిన చెక్క మరియు ఉప్పుతో కలిపి ఒక పలుచటి ముద్దగా రుబ్బండి. తరువాత పూర్తిగా ఉడుకబెట్టబడిన గ్రుడ్ల మీద ఈ ముద్దను పూయండి. తరువాత వీటిని డాల్డాలో వేపండి. తరువాత ఉల్లిపాయ ముక్కలతో తినవచ్చును.

దీనిని తప్పిపోకండి:

ఇంగ్లీషులో క్రొత్తది డాల్డా వంట పుస్తకము — చిత్రములతో నిండినది — ఆర్ట్ పేపర్ — పక్కా పేజీలు — 300 వంట పద్ధతులు — ఆరోగ్యము, పరిశుభ్రత మరియు వంటగృహము గురించి సూచనలు — ఒక రూపాయి మాత్రమే. తపాలా ఖర్చు ఎనిమిది అణాలు వేరే.

దీ డాల్డా అడ్వైసరీ సర్వీస్
పోస్ట్ బాక్స్ నంబరు 353, బొంబాయి 1

డాల్డాతో తయారుచేయబడినవి

మీ భోజన పదార్థములు మరియు తీపి పదార్థములు చాల వాసనగాను, రుచికరముగాను ఉండేటందుకు వాటిని డాల్డాతో తయారుచేయండి. డాల్డా శుద్ధమైనది మరియు పుష్టికరమైనది మరియు సీలుచేయబడిన డబ్బాలలో శుభ్రముగాను, క్రొత్తగాను మిమ్ములను చేరును.

DALDA
HYDROGENATED GROUNDNUT AND OIL

సరియైన ఆహారములో మీకు కావలసిన క్రొవ్వుపదార్థమును ఇచ్చును.

HVM. 171-50 TL

రామరావణయుద్ధం జరిగింది. అందుకోసమే కోతులన్నీ చేరి రాములవారిదండు లాగున ఏర్పడి బయలుదేరాయి. ఈ రామదండుకు ఆంజనేయులవారు సేనాధిపతిగా ఉన్నారు. మహా పతివ్రతయైన సీతను రక్షించడానికి బయలుదేరిన రామదండు రాక్షసుల బందిఖానాలో నుంచి సీతను విడిపించింది. కీర్తిశేషుడైన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు కూడా చీరాలలో ఒక రామదండును ఏర్పాటు చేశారు. ఆ రామదండు 1921 సం॥లో ఏర్పడింది. గాంధిమహాత్ముడు భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి "సత్యాగ్రహం" అనే పేరుతో శాంతంగా ఒక పోరాటం సాగించారు. అప్పుడు యీ దేశాన్ని పరిపాలించిన ఇంగ్లీషువారిని ఎదిరించి యీ పోరాటం సాగించారు. గాంధి మహాత్ముని ఆజ్ఞప్రకారంగా ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి రామదండు యీ సత్యాగ్రహపోరాటం సాగించింది.

ఈ సత్యాగ్రహం ప్రారంభించడానికి ముందు పంజాబురాష్ట్రంలో 'జలియన్వాలాబాగు అనే పార్కులో చాలామంది జనం సభ చేస్తూఉంటే, డయ్యరు అనే పేరుగల ఒక సైనికాధికారి అక్రమంగా ఆ సభలోని జనులమీద తుపాకులు కాల్పించాడు. చాలామంది స్త్రీలను పురుషులను క్రూరంగా హింసించి అనేక అవమానాలు చేయించాడు. రాక్షసి పనులు చేశాడు డయ్యరు.

"పంజాబు" అంటే పాంచాలదేశం-పాంచాల జనులకు జరిగిన యీ అవమానం భారతదేశం అంతటికీ జరిగినట్లుగా గ్రహించండని గాంధిమహాత్ముడు మనదేశంలోని ప్రజలకందరికీ చెవినిల్లు కట్టుకొని బోధించాడు. బ్రిటిష్‌వారిమీద మన ఆగ్రహాన్ని చూపించాలని అన్నాడు-బ్రిటిష్‌ప్రభుత్వానికి సహాయంచేయకూడదన్నాడు. పన్నులు చెల్లించకూడదన్నాడు-పాంచాల రాష్ట్రమునకు జరిగిన పరాభవం అంటే పాంచాలీ పరాభవం వంటిది-పూర్వకాలంలో పాంచాలి అంటే పాండవుల భార్యయైన ద్రౌపది అనే పతివ్రతను నిండుసభలో కౌరవులు నిలువబెట్టి చీరె ఊడదీయుటకు ప్రయత్నించారు. ఇటువంటి ఘోరమైన క్రూరమైన పనిచేయడం మూలంగా పాండవులకు పూర్తిగా కోపంవచ్చింది-పాంచాలికి చీరె విప్పించిన దుర్యోధనుని తొడ విరుగకొడ్తానని భీముడు ప్రతిజ్ఞచేశాడు. ఆఖరుకు పాండవులకూ కౌరవులకూ పెద్ద యుద్ధం జరిగింది. అదే మహాభారతయుద్ధం-ఈ యుద్ధంలో పాండవులు జయించారు.

# జయ విజయీభవ!

అధర్మంగా అక్రమంగా ప్రవర్తించిన కౌరవులు ఓడిపోయినారు. ధర్మం, సత్యం జయించినవి. అదేవిధంగా మన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేటట్లుగా గాంధిమహాత్ముడు సాగించిన సత్యాగ్రహంలో, సహాయనివాకరణ పోరాటంలో, కాంగ్రెసు పక్షమందు చేరిన నాయకులు గెల్చారు-దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. సత్యాగ్రహంవల్ల విజయం కలిగింది.

కాని, యీ సత్యాగ్రహ పోరాటం పూర్తికాక ముందు చాలామంది దేశభక్తులు ఖైదులలో పడి అనేక కష్టాలపాలైనారు. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు జెయిల్లో చాలాకాలం శిక్ష అనుభవించారు. ఆంధ్రపత్రికను స్థాపించిన శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు యీ సత్యాగ్రహంలో నాయకులై ముందంజవేసి జైలులో శిక్షలు అనుభవించారు. కాని ఆనాటి దేశభక్తులు, దేశోద్ధారకులు, ఆంధ్ర రత్నములు నేడు లేరు. వారు మరణించినప్పటికీ వారి కీర్తి మిగలడంవల్ల వారి పేర్లు మనం సంకీర్తన చేస్తున్నాము. ఆనాడు భారత స్వాతంత్ర్యంకోసం పోరాడిన ఆంధ్ర నాయకులు ఈనాడు చాలామందిలేరు మహాభారతయుద్ధంలో ధర్మంకోసం పోరాడిన పాండవులు కూడా నేడు లేరు. కాని అటువంటి మహావీరులను గూర్చిన కథలు విని వారినిజ్ఞాపకం చేసుకోవలసిన పండుగ ఇది. అందుకనే,

"పాండవులే పాండవులే తుమ్మెదా
పంచా పాండవులే తుమ్మెదా"

అని ఆభారతవీరుల కథలను యింటింటికి వచ్చి యీ పండుగ రోజులలో హరిజన స్త్రీలు మనోహరంగా పాడి వినిపిస్తున్నారు—పెరిగి పెద్దవాళ్ళు కావలసిన పిల్లలందరూ మన భారత వీరుల కథలు వింటూ ఉండాలి. ఆంజనేయులవారివలె పెరిగి పెద్దవాళ్ళు కావాలి. కాని, రాములవారిముందర చీమలవలె ఉండడం నేర్చుకోవాలి. రామాయణం, భారతం యీ రెండింటిలో ఉండేకథలు బాగా చదివితే ఆంధ్ర బాలబాలికలందరూ ఆంధ్రరత్నాలవుతారు. ఆ విధంగా ఆంధ్ర రత్నాలు తయారవుతే, ఆంధ్ర రాష్ట్రం తప్పకుండా వస్తుంది. మనకు తప్పకుండా జయం కలుగుతుంది. దిగ్విజయం కలుగుతుంది. తథాస్తు.

శ్రీరస్తు! శుభమస్తు! నిత్యవిజయోస్తు!
జయవిజయీభవ! దిగ్విజయీభవ!

★

ఆరోగ్యానికీ, సౌందర్యానికీ
మా రెండు అమూల్య రత్నాలు

★
కాసినో స్నో
మొటిమలను పోగొట్టి ముఖలావణ్యమును పెంపొందించును.

★
కాసినో వెజిటబుల్ హెయిరాయిల్
మృదువై దీర్ఘమైన కేశములను ప్రసాదించును.

★
కాసినో టాల్కం పౌడరు

చర్మమునకు యింపును మృదుత్వమును యిచ్చును

Casino REGD TALCUM POWDER MILDLY SCENTED

మనోహరమైన సువాసన కలది.

చంద్రా ట్రేడింగ్ కంపెనీ మద్రాసు

# పెద్దల చర్యలకు

# పిల్లలభాషలో వ్యాఖ్యానం



# బాలబాలికల సాహిత్యం

—రవీంద్రనాథ టాగూర్

(1907వ సంవత్సరంలో స్వదేశీ ఉద్యమం రోజులలో దక్షిణరంజన్ మిత్రా మజుందార్ బెంగాల్‌లో పల్లెపల్లెలూ తిరిగి పిల్లలకోసం ఎన్నో కథలు సేకరించారు. ఈ కథలు "ఠాకుర్ మార్ ఝులీ" (అమ్మమ్మ కథల సంచీ) అనే పేరుతో బెంగాలీ భాషలో వెలువడ్డాయి. ఈ పిల్లల కథల పుస్తకానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ అన్న ముక్కలివి. కేవలం వంగరాష్ట్రాన్ని గురించి మాట్లాడినా, రవీంద్రుని సలహా యావద్భారతదేశానికీ వర్తిస్తుంది.)

భారతదేశంలో అమ్మమ్మ కథల సంచీకంటే స్వదేశీవస్తువు మరొకటి లేదని నా ఉద్దేశ్యం. ఈలాంటి చక్కటివస్తువు ఈనాడు మాంఛెష్టరు మిల్లులలో తయారవుతూందంటే చాలా విచారించవలసిన విషయం. విదేశాలనుంచి దిగుమతి అయ్యేకథలు మాత్రమే మన పిల్లల వినోదానికి గతి అవుతున్నాయంటే మన దేశంలో "అమ్మమ్మలూ అండ్ కంపెనీ" దివాలాతీసిందన్నమాట. ఈనాడు వీళ్ళ సంచులు దులుపుతే బహుశా బర్క్ ఫ్రెంచి రివల్యూషనో, మార్టిన్యు నీతిబోధనలో దొరుకుతాయేమో! మన రాజకుమారులూ, రాజస్థానాలలోని మహావీరులూ, బంగమా, బంగమీ (కథలుచెప్పే పక్షులు, బెంగాలీలో) వీళ్ళంతా ఏమైనట్టు? ఏడుగురు రాజులూ, ఏడు సముద్రాలూ, పదమూడు నదులూ వీటి కథలనిక ఎక్కడ వున్నట్టు?

పల్లెజీవనానికీ, ఆనందానికీ ఆధారమైన జాతరలూ, పండుగలూ, పర్వాలూ, పండుగ పాటలూ, బుర్ర కథల దళాలూ అనే ఈ అమృత ప్రవాహం కాలగతిని క్రుంగి కృశించి, ఎండిపోతున్న కాలదీ ఇసక తిప్పలూ, రెల్లుగుబ్బలూ బయటపడుతున్నాయి. వీటిలాగే కథలకి దూరమైన పెద్దవాళ్ళ మనస్సులు స్వార్థంతోనూ, ద్వేషంతోనూ కఠిన శిలలౌతున్నాయి. ఏ పాపం ఎరుగని పిల్లలు, చల్లని పిల్లతెమ్మెరలతో, హాయినిచ్చే ఈ అమృతధారలకి నోచుకోలేదంటే తప్పెవరిది? ప్రతి సా



రవీంద్రనాథ టాగూర్

యంత్రం చక్కటి కథలూ, పాటలతో, ఆనందంతో కలకలలాడవలసిన పిల్లల పక్కల దగ్గర నేడు నైరాశ్యం, నీరవతా, దిగులూ తాండవిస్తుందేం? రాత్రిదీపాల ముందు బ్రహ్మరాక్షసిలా కనబడే ఇంగ్లీషు ముక్కలు ముక్కున పెట్టుకోడానికి ఎంగుకు వచ్చిన చదువురా అని జోగుతూ, భయపడుతూ కూర్చుంటారేం? తల్లిపాలకి నోచుకోక పిండిపాలకి ఎగబాకే పిల్లలకి పుష్టి, సౌష్టవం ఎక్కడనుంచి వస్తుంది? మన సంస్కృతీ, పూర్వపు ఔన్నత్యాన్నీ గురించి ఇంటికప్పులమీద నిలబడి ఉపన్యాసాలిచ్చిన పెద్దలు ఈ విషయంలో కిమ్మనరేం? భారతమాత తన పిల్లలకోసం ఎంతో భద్రంగా, ఆప్యాయంగా దాచిపెట్టిన ఎన్నో విషయాలు ఏవీ?

యుద్ధాలూ, రక్తపాతం, కరువులూ ఎన్ని వచ్చినా, రాజులూ, రాజ్యాలూ ఎన్ని మారినా, ఈ ఉపద్రవాలన్నిటికీ తట్టుకుని, ఈ కథలని ఊతగా తీసికొని బెంగాలీ మాతృహృదయం తన అమృతహస్తాలతో తరతరాలుగా తన బిడ్డల్ని పెంచుకుంటూవచ్చింది.

ఎన్నో బాధలకీ, అన్యాయాలకీ గురియైన బెంగాలీ ప్రజల్ని రాజా, పేదా అనే భేదం లేకుండా, కష్టానికీ సుఖానికీ ఆదుకుంటూ, చల్లని వెన్నెలరాత్రులలో ఈ కథలే వాళ్ళ వ్యధితహృదయాలకి హాయినిస్తూ కష్టాలనుంచి వాళ్ళని గట్టెక్కించాయి. ఈ కథలే బెంగాలీపిల్లలకి జోలపాటలయాయి. ఈ కథలు వింటున్నాడంటే బెంగాలీ పిల్లవాడు చక్కటి కథకి ముగ్ధుడవడమే కాకుండా, భారతదేశపు పురాతన వైభవం, ఉన్నతాదర్శాలూ ఆ లేత హృదయానికి హత్తుకుపోతాయన్న మాట.

ఆఖరున ఒక్క సూచన చేస్తాను. ఇకనైనా ఆలస్యం చేయకుండా ఈనాటి అమ్మమ్మలందరికీ ఒక పాఠశాల పెట్టాలి. అందులో వీళ్ళకి పిల్లలని జోకొడుతూ, చక్కటి కథలు చెప్పడంలో తరఫీదు ఇవ్వాలి. అప్పుడే భావి భారత పౌరులైన మన పిల్లల ద్వారా మన పూర్వపు ఔన్నత్యం పునరుద్ధరింపబడుతుంది.



"అనగనగా ఒక ఊ. ఊ. ఊళ్ళో"



"వాడిపని రేపుపట్టించాలి"



"ఇవ్వాళ ఆ కిష్టుగాడు నన్ను కొట్టాడురా..!!"



"సోమూగాడికి తనేగదా కొత్తచొక్కా తొడుక్కున్నాననిగావును ఆ గర్వం"



"ఆరి నన్ను పొతెయ్య, ప్రతివాడూ నన్ను మెచ్చుకునే వాడే!"



"అమ్మ తమ్ముణ్ణే ఎప్పుడూ ముద్దెట్టుకుంటూ వుంటుంది, చూశావా!"



"నానోట్లో ఏముందో చెప్పుకో!"



"నానోట్లోనూ ఉందిలే!"



"పెద్దయ్యాక, సైకిలెక్కి,, షికార్లె...."

రామగోపాల్



"ఏమిటీ బొమ్మ కిచకిచమంటోంది?—"



"ఆ, నే చెప్పలా..."



"కొట్టారా ! అ...."



"అమ్మా, నాకు అప్పచ్చి పెట్టవా ?"



"నేను ఏపనిచేసినా మెచ్చుకునేవాళ్లు లేరు, యీ కొంపలో"



"ఒరేయ్, రామూ చప్పుడుచేయ్యకుం చప్పునవచ్చేయ్."



కూంచి క్లాసైనా వెయ్యాలి."



"అమ్మా ! భయమేస్తోందే."



"మార్కులు తెలిసేరోజు ఇవ్వాళేనా బోలు"



"మ్మ్ చేంబా ."



"నేను అబద్ధం చెప్పలేదండీ, నాన్నారూ !"



"నాన్నా.., అమ్మ కొట్టిందీ ..ఇ ..ఇ..."





"పోమ్మా, నువెప్పుడూ ఇంతే...

# బళ్ళోకి పోరా నాయనా

శ్రీ గొళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

తండ్రి : ఏమిరా! కిష్టి ఏంచేస్తున్నావు?

.........

నిన్నేరా. మాట్లాడవేం బెల్లంకొట్టిన రాయిలాగా.

కిష్టి : ఏంచెయ్యటంలేదు.

తం : ఏంచేయకపోతే బిత్తరపోయి చూస్తున్నావెందుకు ఏదో పెద్ద నేరస్థుడిలాగా. పదిన్నరఅయినా బడికి పోలేదేం. ఇవాళ బడిలేదా ?

కి : ఉంది.

తం : ఉంటే మరి పోలేదేం.

కి : తలనొప్పిగా ఉంది.

తం : తలనొప్పా గిలనొప్పా. పద ముందు బడికి.

(తల్లి ప్రవేశిస్తుంది గదమాయింపు విని)

తల్లి : పాపం! తలనెప్పిగా ఉందని ఇందాక అన్నం తినేటప్పుడే చెప్పాడు. అందుకని నేనే ఉండమన్నాను.

తం : ఓహో! ఇందులో నీకూ కొంత భాగం ఉందన్నమాట. తలనెప్పి అన్నం తిన్న తరువాతనేగా వచ్చింది. అంతా దొంగవ్యవహారం. వాడి ముఖం కనపడటంలా! నీ చనువువలననే వాడు ఎందుకూ పనికిరానివాడుగా తయారవుతున్నాడు.

తల్లి : ఏమో! నా కెందుకొచ్చిన గొడవ మీ ఇష్టం. నే వెళ్ళి తిరగమాత పెట్టుకోవాలి. (అని వెళ్ళును)

తం : ఏమిరా! వెళ్తావా లేదా ఇంతకూ.

కి: ఆలస్యంగా వెళ్తే తంతారు నాన్నా.

తం : ఎవర్రా తన్నేది?

కి : ఆచారి మేష్టారు నాన్నా.

తం : ఆయన దేనికి వస్తాడురా ?

కి : ఘర్ఘుఘారం లెక్కలు, సోషల్ స్టడీస్‌కి. పాఠం రాకపోయినా ఆలశ్యంగా పోయినా డొక్క చీలుస్తాడు.

తం : ఆయన పూర్తి పేరేమిటిరా ?

కి : అందరూ కందెపచ్చడి అంటారు నాన్నా.

తం : నీ మొఖం! ఏడ్చావులే.

కి : ఆయనకు కందిపచ్చడి అంటే ఇష్టంట.

తం : కాదు. పిల్లల్ని కందిపచ్చడి లాగా నూర్తాడుగామాల్ను.

కి : మొన్న ఒకడిని కొడ్తే ముక్కుంబడి నెత్తురు వచ్చింది. నాకు భయం. నేను పోను నాన్నా. పైగా ఈపూట రెండు పిరిడ్లూ ఆయనవే.

తం : ఏం కొట్టడు. తలనెప్పిగా ఉంటే ఆలశ్యంగా వచ్చానని చెప్పు.

కి : తలనెప్పంటే తలమీదనే కొడ్తాడు నాన్నా.

తం : ఎందుకుకొడతాడో నే చూస్తాగా. నీవు ఇంట్లోకూచుంటే నీకేం తోస్తుందిరా?

కి : కాదు నాన్నా.

తం : నాకు తెలియదురా. తలనెప్పితో ఎట్లాగో కష్టపడి అన్నం తిన్నావుగా. అట్లాగే కొంత కష్టపడి బడికిగూడా పో.

కి : ఇంత లేటుగా వెళ్తే తంతాడు నాన్నా!

తం : నిన్ను కాదు. ఇంకెవరినీ తన్నకుండా నేను చేస్తాగా. మేష్టరు మంచి వాడయితే కుర్రవాళ్ళని కొడ్తాడా! చేతగాకగాని.

## గొప్ప గారడీ ★ రహస్యం ★

భారతదేశంలో గారడీవాళ్లు కొందరు మామిడి టెంకను పాతిన వెంటనే దానికి నీరుపోసి అదిచెట్టుగా మొలిచి పువ్వులు పూసి, కాయలుకూడా కాసే టట్లు చేస్తారు. ఇది గారడీవాళ్లు ఏవిధంగా చేయగల్గుతున్నారు?

శ్లో॥ యానికానిచ బీజాని
జల స్థల జజానిచ
అంకోల తైలలిప్తాని
తాని తాన్యుద్భవంతిహై.

అని ఒక శాస్త్రరహస్యం ఉంది.

తా॥ నీటివేగాని, మెట్టవే గాని, వైనవైనగింజలనుఊడుగు నూనెతో (అంకోల తైలంలో) భావనచేసి నాటితే అవి వెంటనే మొలుచును. కనుక బాగా ఎండిన మామిడి టెంకను ఊడుగు నూనెలో బాగా నానవేసి, ఆ తైలం అంతా ఆ టెంకలో ఇనికిపోయేటట్లుగా కొన్ని దినాలు నూనె గిన్నెతో సహా ఎండబెట్టాలి. ఆవిధంగా భావన చేసిన మామిడి టెంకను జాగ్రత్తగా దాచియుంచుకొని గారడీ ప్రదర్శనం చేసి చూపించవచ్చు. ఆ టెంకను నేలలో పాతిపెట్టి నీళ్లుపోసిన కొంతసేపటికి మొక్క మొలచి మరి కొంత సేపటికి పూలు పూచి, కాయలు కాస్తుంది. ఇది చాలామందికి తెలియనిరహస్యం. దీనిని మీరు కూడా రహస్యంగా ఉంచండి. ఎవ్వరికీ చెప్పవద్దు. ఈ విధంగా చేస్తే శీతాకాలంలో కూడా బంగినపల్లి మామిడిపళ్ళు కాస్తాయి- హాయిగా తినవచ్చు.

కి : అందుకే నాన్నా...

తం : నేను ఉత్తరం రాసిస్తా తీసుకొని హెడ్‌మాష్టరుగారి కియ్యి.

కి : ఇస్తే కొట్టడా ?

తం : ఇంకా కొట్టడమే. కొడ్తే ఉద్యోగం ఊడదూ. పుస్తకాలు తీసుకొనిరా. ఉత్తరం పట్టుకెళ్తువుగాని. (పుస్తకాలు పట్టుకొని సీలుచేసిన కవరు పట్టుకొని కిష్టి బయలుదేరిపోవును)

తం : వచ్చేటప్పుడు జబాబు పట్టుకొనిరా.

కి : (వెళ్తూ తనలో) మొన్న వెంచె క్కించాడుగా. ఇవాళ కసితీర్చుకోవాలి.

తం : ఇదుగో చూశావుటే.

తల్లి : ఏమిటండీ.

తం : వాడికి తలనెప్పిలేదు; పాడూ లేదు. ఇక ఇట్లా చెయ్యకుండా చేశాను చూచావా ! (నవ్వు)

త : ఎందుకండీ అంత నవ్వు. పాపం పిచ్చిసన్న్యాసిని ఏంచేస్తారో ఏమో !

తం : వీడు చెప్పినవన్నీ అబద్ధాలే. ఆచారిగారు కొడ్తారుట. అసలు కొట్టని పంతులు ఆయన ఒక్కడే. అమాయకంగా ఉంటాడని ఆడిస్తారు ఆయన్ని. ఆయనకి కందిపచ్చడంటే ఇష్టంట. అందుకని ఆయన పేరు కందిపచ్చడిట.

తల్లి : మీరూ మేష్టరయితే మీ పేరూ ఏ వంకాయబజ్జినో, పచ్చిపులుసనో పెట్టేవారు. లేవండి వంటయింది.

*    *    *

(కిష్టి ఉత్తరం హెడ్‌మాష్టరుగారు కిచ్చి క్లాసులోకి పోతాడు)

ఆచారిగారు : ఏమిరోయి ! ఇప్పటికేనా తెల్లవారింది.

కి : కాదండీ.

ఆ : కాదండి ఏమిటిరా ! పిరియడ్ అయిపోవస్తుంటే.

కి : తలనెప్పిగా ఉంటే...

ఆ : అయితే ఇప్పుడెందుకు వచ్చావురా ?

కి : మా నాన్న ఇంట్లో ఉండనీయ లేదండి. మందుఇచ్చి బడికిపోయేలోగా నే పోతుంది పొమ్మన్నాడండి.

ఆ : మీ నాన్న ఎంత మంచివాడురా. నీ చదువంటే ఎంత శ్రద్ధ.

కి : (తనలో) ఇంకాసేపు వుంటే మా నాన్నకు మీ మీద ఎంత శ్రద్ధఉందో తెలుసుకుంటారుగా.

ఆ : మరి పోయిందా ఇప్పుడు.

కి : పోతూపోతూ ఉంది. (తనలో) తమ ఉద్యోగం. ఇవాళ ఎట్లాగైనా ఒప్పుకొని దెబ్బలుతింటే.

ఆ : హోంవర్కు చేశావురా ?

కి : తలనెప్పిగా ఉండి చేయలేదండి.

ఆ : తలనెప్పి లేనప్పుడు ఏంచేశావురా?

కి : సందేహం వచ్చిందండి.

ఆ : నీకు అన్నీ ధర్మసందేహాలేగా. ఎగ్గొట్టటానికి ఇదొక వంక.

కి : నిజంగా నేనండి. ఒకపనిని ఒక మనిషి పదిరోజులలో చేస్తే పదిమంది ఒక రోజులో చేస్తారుగదండి.

ఆ : దానిలో తప్పేముందిరా.

కి : ఈ సూత్రం అన్నిట్లో అన్వయించదండి.

ఆ : నీ మొఖం !

కి : ఒకపడవ పదిమైళ్ళ కాల్వని పది గంటలలో దాటితే పది పడవలు ఒక గంటలో దాటగలుగుతవండీ ?

ఒక పిల్లవాడు : నే చెపుతానండీ. గంటలో దాటుతుంది.

ఆ : ఏడిచావులే కూర్చో. ఒరే ! కిష్టీ. నీకు ఈ లెక్క ఎక్కడిదిరా.

కి : మా అన్నయ్య చెప్పాడండి.

## "పిల్లలు కల్లకపటం మెరుగనివారు"

★ —గాంధీజీ

"పిల్లలు సహజంగా కల్లకపట మెరుగనివారు. వారి హృదయాలు ప్రేమపూరితాలు. వారి ప్రవృత్తి కరుణామయం. పిల్లలు చేసే ఆ అల్లరిలో కూడా ఎంతో అమాయకత యిమిడి వుంటుంది. ఇలాంటి యీ పవిత్ర హృదయాలకు చెడు వాసన తగలటం పెద్ద అన్యాయకనే.

ఇదే యథార్థమయితే పిల్లలందరూ మొదటినుంచీ జాగ్రతపడి, ఒకరినొకరు వున్న తాదర్శాలవైపుకు నడిపించుకుపోవాలి. చెడు వాసనలవైపు మొగ్గుచూపుతున్న తోటి బాలబాలికలు అధఃపతితులు కాకుండా కాపాడుకోవాలి. పొరుగు పిల్లవాని ప్రవర్తనను ప్రతి బాలుడు గమనించాలి. అవసరమైతే ఒకరినొకరు మందలించుకోవచ్చు. అవతల వ్యక్తుల ప్రవర్తనను పొంచివుండి గమనించటమంటే, అదేదో ఒక పోలీసు చేసే పనిలా వుండకూడదు. మీరంతా దేవుని దూతలమన్న భావంతో నే పనిచేయాలి. దేవుడు మనం చేసే పనులను పరీక్షగాచూస్తున్నాడంటే - మనం తప్పుడు పనులు చేసినప్పుడు కొట్టి తిట్టి కూర్చోబెట్టుడామన్న వుద్దేశ్యంతో కానేకాదుగా! మన మంచిని కోరే మహోకమనిషి, మనకంటే పెద్దవాడు, గొప్పవాడు హెచ్చరిస్తున్నట్లుగా మందలించటానికే కానీ, మనను శిక్షించటానికి ఎన్నటికీ కాదు. మీరుకూడా అలాగే పరాయిపిల్లల పనులను పొంచివుండి చూసేటప్పుడు వారిని శిక్షిద్దామని కాని, పెద్దలకు చెప్పి కొట్టిద్దామని కాని అనుకోరాదు. అవతలవాళ్లు చేస్తున్న పనిలో ఏది తప్పో వాళ్ళకు నచ్చచెప్పటమే మీ వుద్దేశంగా వుండాలి. మీలో ఎవరైనా ఒకరు అబద్ధమాడారనుకోండి. అలాంటి సందర్భంలో మీరు అతనిమీద కోపగించకూడదు. అబద్ధమాడే తత్వం పోగొట్టుకొనేటందుకు అతనికి మీరు సాయపడాలి."

(గాంధీజీ సేవాగ్రామం ఆశ్రమ బాల బాలికలకు హరిద్వార్ నుంచి వ్రాసిన లేఖలోని భాగం)

రాబోవు ఆటలపోటీకి



అమృత
రక్తశుద్ధి
ద్రావకము.

ఛాంపియన్ షిప్ పోటీలలో శ్రమకరమైన ఆటలను ఉద్రేకపూరితమైన క్షణాలను. విభ్రాంతిగా అలసట పొందకుండా నెగ్గటానికి అతడికి సహాయపడుతుంది.

353.A.E.

కేసరికుటీరం లిమిటెడ్, రాయపేట,
మద్రాస్.

తమిళనాడుకు ఏజెంట్లు:
ఒరిస్సా, నైజామ్స్, మైసూరు, ఆంధ్రజిల్లాలకు,
సీతారామా జనరల్ స్టోర్సు.
బరహంపూరు - సికిందరాబాదు,
బెంగుళూరు - బెజవాడ - మధుర.

చదవండి! తెనుగు వార & మాసపత్రిక
జయభారత్
ఎడిటర్:-చక్రవర్తి వేణుగోపాలరావు
జాంబాగ్, హైద్రాబాదు-ద-1.

# బళ్ళోకిపోరానాయనా

ఆ: మీ అన్నయ్య సలహాలు పాటించావా S. S. L. C కి మూడు జన్మలు పట్టుంది. అతితెలివికి పోక నోరు మూసుకొని కూర్చో. (గంట మోగుతుంది. లెక్కల పిరియడు అయిపోయింది. ఇప్పుడు సోషల్ స్టడీస్. ఇప్పుడుకూడా ఆయనే)

ఆచారిగారు: క్రిందటి పాఠంలో ప్రశ్నలు వేస్తా. చదివినవాళ్లు చేతులెత్తండి. (అందరూ ఎత్తుతారు)

ఆ: పానిపట్టు యుద్ధం ఎక్కడ జరిగిందిరా నూరీ?

నూరి: నాకు తెలియదు సార్.

ఆ: మరి చదివానని చెయ్యెందుకు ఎత్తావు?

నూరి: నాకు వచ్చిన ప్రశ్న అడుగుతారనుకొని...

కి: నే చెపుతానండి!

ఆ: నిన్నెవరడిగారురా. నోరు మూసుకొని కూర్చోక.

నూరి: మొన్న పానిపట్టుయుద్ధందగ్గరకు వచ్చేటప్పటికి బెల్ కొట్టే పని పట్టుకొని యుద్ధం చేయకుండానే ఇంటికి పోయామండి. (అందరూ నవ్వుతారు)

ఆ: సైలెన్సు. ఏమిరా కిష్టీ?

కి: అవునండి.

ఆ: ఏమిటిరా?

కి: సైలెన్సండి.

ఆ: అది కాదురా వెంగళప్పా! పానిపట్టు ఎక్కడ జరిగిందిరా?

కి: అసలు దానిపేరు పానిపట్టు కాదండి. పారిపట్టు యుద్ధం. సురాజుద్దీలా సైన్యం పారిపోతూ ఒక బ్రిడ్జీ ఎక్కితే అది కూలిందండి. అక్కడకు రాబర్టుక్లయివు వచ్చి ఆ పారిపోయేవాళ్ళతో యుద్ధం చేశాడండి. (అందరూ నవ్వుతారు)

ఆ: ఏడిశావు. ఏళ్లు ఎగసనా బుద్ధి దిగసనా. అసలు నీవు తెలివిగలవాడివే, ఆ తెలివంతా పరీక్షలు తప్పటానికే ఉపయోగించుకొంటున్నావు. ఈతడవ ఇట్లా చేశావా తంతాను.

కి: (తనలో) నాకొక్కవల్సిందీ అదే.

ఆ: చూస్తే మీ నాన్న వేసిన మాత్రతో తలనొప్పితోపాటు నీ తలకూడా పోయినట్లుంది. ఈపూటకు బెంచీ ఎక్కు.

కి: నిన్న నేగదండి బెంచి ఎక్కింది.

ఆ: నిన్న అన్నం తిన్నావుగా ఇవాళ గూడా తిన్నావేం?

కి: నిన్న వంకాయ బజ్జీతో తిన్నానండి.

ఆ: మరి ఇవాళో!

కి: కందిపచ్చడండి. (అందరూ గొల్లున నవ్వుతారు.)

ఆ: సైలెన్సు. ఇట్రారా కిష్టీ. నీకు రోజుకొక రకం కావాలిగదూ. పట్టు (ఆ చెంపమీద నాల్గు ఈ చెంపమీద నాల్గు ఇచ్చుకుంటాడు కందిపోయేలాగా) బాగుందా. నంచుకుంటానికి కావద్దూ ఏమన్నా. ఇదిగో పట్టు (అని వీపుమీద రెండు ఇచ్చుకుంటాడు)

కి: (ఏడుపుముఖంతో తనలో) మీ పని పట్టించటానికి నాకు సాక్ష్యం దొరికిందిలెండి.

ఆ: ఇంకా చూస్తావేం. నోరుమూసుకొని బెంచీఎక్కక! (బెంచీ ఎక్కుతాడు అంతా నిశ్శబ్దం...............)

[హెడ్ మాష్టరుగదిలో, పిరిడు అయిన తరువాత]

హెడ్: ఏంరా! కిష్టీ. నీ నడతేం బాగాలేదు. అంతా ఆచార్లుగారు చెప్పారు.

కి: మా నాన్న రాసిచ్చిన ఉత్తరానికి జవాబు రాయించుకురమ్మన్నారండి. నన్ను అనవసరంగా మేష్టారు కొట్టారండి.

హెడ్: వెధవ దొంగవేషాలూ నీవూ. నన్నుగూడా మోసగిద్దామనుకుంటున్నావూ. కవరులో తెల్లకాయితం పెట్టుకొచ్చి (బెత్తం తెచ్చి) హోల్డప్ యువర్ హాండ్ (అని రెండు తగిలించి) ఇకనుంచి ఇట్లా ఎప్పుడూ చేయవుగదా! ఇక పో.

(ఇంట్లో వాళ్ళ నాన్న; అమ్మలు ఎదురై)

తండ్రి: ఏంరా! జవాబు తెచ్చావా! నివ్వెందుకు తెస్తావు గ్రంథసాంగుడివాయె.

కి: (ఏడుస్తూ) ఇంక ఎప్పుడూ ఇట్లా చెయ్యను నాన్నా బుద్ధి వచ్చింది.

తం: మరి చెంపలు వేసుకోవేంరా. (నవ్వి) ఏమయిందిరా?

తల్లి: ఏమీ కాలా. మీరు చేయించిన ఘనకార్యమే. చెంపలు కనపట్టంలా. ఎర్రగా కందిపోయి. దానిమీద ఇంకా చెంపలు వేసుకోమంటానికి మీకు నోరెట్లా వచ్చిందండి.

తం: దానికి నేను కారణం గాదు. నీవు ఇచ్చిన అలుసే అట్లా చేయించింది. "రాజుకొడుకయినా గానిబుగ్గలు మెలవంది బుద్ధి రాదు" అని ఊరికనే అన్నారా?

ఇకనుంచయినా "బళ్లోకి పోరానాయనా అంటే" "పంతుల్ని చూస్తే భయమేస్తుంది నే పోనే తల్లీ అనవుగదా?" రేపూ ఎల్లుండి శని ఆదివారాలుగామాల్ను. పోయి ఆడుకో పో.






ఒకానొకప్పుడు కుమారయ్యారు అని ఒక వెర్రిబాగులవాడు ఉండేవాడు. ఆయన కొంత కాలానికి విజయవాడ, సిమెంటు ఫ్యాక్టరీలో అసిస్టెంటు మేనేజరుగా అవగలిగాడు. ఆయన గుణగణాలను చూసి ఫ్యాక్టరీలో *Workers* వగైరాలు తోకయ్యగారు అని ముద్దుపేరు పెట్టారు. ఇల్లుకోసము విజయవాడను గాలించి, చివరికి పూర్ణానందపేటలో ఇల్లు తీసికొన్నాడు. ఆ యింటి యజమాని నరశింహామూర్తిగారు చాలా సౌమ్యుడు; మంచివాడు; అని ప్రతీతి.

ఇట్లా ఉంటుండగా నరశింహమూర్తి గారింట్లో ఆయన తండ్రి సంవత్సరీకాలు వచ్చాయి. ఆమూడు రోజులు గూడ చాల ఘనంగా ఓముప్ఫైమందిని పిలచి భోజనాలు, మిగతా తతంగము కానిచ్చాడు. ఈమన తోకయ్యగారు గూడ వెళ్ళి సుష్టుగా భోంచేసి వచ్చాడు. కాని ఈ హడావిడికిగల కారణాన్ని తెలుసుకొనలేక పోయాడు. రెండురోజులు పోనిచ్చి నరసింహామూర్తిగారిని అసలు సంగతి చెప్పమని అడిగాడు. అది పితృకార్యమంటారు. అది మాకు చాలాపట్టు. ఈ విధంగా చేస్తూంటే మా పెద్దలు తరిస్తారు. వారిని నరకబాధనుండి తప్పిస్తుంది. అని చేస్తాం. అని ఆయన అన్నారు. ఓహో! అలానా!!

అని అక్కడికి తనకి బాగా తెలిసినట్లు తల ఊపాడు అయ్యారు.

ఆ రోజు రాత్రి అయ్యారుకి నిద్రపట్టనే లేదు. తనుకూడ ఒకపితృకార్యము చేస్తే తన తండ్రి, తాత, ముత్తాతలు అందరు తరిస్తారుగా! వారందరిని నరకమునుంచి తప్పించినవాడవుతాడుగా! లోకం గూడ తన పితృభక్తికి మెచ్చుకొంటుందిగా ఇంటియజమాని ముప్ఫైమందికీ ఏర్పాటు చేశాడాయెను. తను ఒక వందమందికి మూడురోజులు ఏర్పాటుచేస్తె! ఈ ఆలోచలతోనే తెల్లవారింది.

తెల్లవారి 6 గంటల వేళ వీధి అరుగు మీద దర్జాగా కూర్చుని దంత ధావనము ప్రారంభించాడు. ఇంతలో అల్లంత దూరంలో గోపాలకృష్ణయ్య అనే వైదీకుడు పురోహితుడు వస్తున్నట్లు అగపడింది మన తోకయ్యకి! నిజంగా చెప్పాల్సివస్తే గోపాలకృష్ణయ్య మొఖం ఎరుగడు. ఇంటి యజమాని పిలుస్తూంటేనూ; ఆయనను చాలాసార్లు చూసినందువల్లనూ గుర్తుపట్టగలిగాడు. గుర్తుపట్టడమేమిటి వెంటనే ఆలోచన ఒకటి మెరపులా తట్టింది. ఈయనతో చెప్పి ఆ పితృకార్యము తొందరలో చేయిస్తే, సరె! యింకేం! రాజు తలిస్తే దెబ్బలకు కొదవా!

అయ్యా! గోపాలకృష్ణయ్యగారూ! మీ దర్శనమే లేదే! కారణం? ఇటురండి. ఎక్కడకు పోతున్నారు? అని చిరపరిచితుడులా ప్రశ్నించాడు. ఈయనిలా తనని ప్రశ్నించేసరికి గోపాలకృష్ణయ్యగారికి తగని ఆశ్చర్యమేసింది. వెంటనే తన ఆశ్చర్యాన్ని కప్పుకొని "మరేనండీ! ఈ బ్రాహ్మణోత్తాలతో తీరికేలేదు. ఏదో ఈవాళ ఏకాదశిగదా! ఒక అణాడబ్బులు వస్తాయన్న ఆశతో కృష్ణకు పోతున్నా అన్నాడు. ఇంతలో మన తోకయ్యలోని కెళ్ళి 7 గంటలు కావొస్తోందని తెలుసుకొని సూటు వేసుకొని కాఫీ వగైరాలు కానిచ్చుకొని వచ్చాడు. వచ్చేసరికి గోపాలకృష్ణయ్య" అయ్యా తమకి కంపెనీ వేళైనట్లుంది. సెలవిప్పించండి అన్నాడు.

అయ్యో! ఎంతమాట! పనిఉండి పిలిచాను! పెద్ద పనికాదులెండి! ఒక పితృకార్యము ఒకటి మాయింట్లో జరిపించాలి! ఆ విషయమై మీరేమంటారో అని అన్నాడు తోకయ్య ముఖం అదోలా పెట్టి.

దానికేమిబాబూ! తప్పకుండాను! భోక్తలెంతమంది కావాలి? ఇంతకీ ఎవరికీ పితృకార్యం? ఎప్పుడు అని గోపాలకృష్ణయ్య ప్రశ్నలవర్షం కురిపిస్తోంటే మన తోకయ్య వళ్లు మండిపోయింది? పితృకార్యం, జరిగించమంటే ఈ ప్రశ్న లేవటేయమన్నాడూ అనుకొని నిదానం ప్రధానం అని పెద్దలన్నారు అని మనసు దిటవు తెచ్చుకొని" ఎవరిది కాదండీ ఉట్టిదే! ఊరికే సరదాకి చేస్తాను. మొన్న నరశింహామూర్తిగారింట్లో మూడురోజులు చేయించలేదూ! అటువంటి పితృకార్యమే! అన్నాడు తృప్తికరంగా.

గోపాలకృష్ణయ్య సహజంగా తెలివైనవాడు. విషయమంతా త్రుటికాలంలో గ్రహించేశాడు. "సరే దానికేం బ్రహ్మాండము ఎల్లుండి ఆదివారం త్రయోదశి మంచిది మీకు శెలవు మాకు ఖాళీగా ఉంది! ఎంతమందిని పిలిస్తే..." అని నసిగాడు. అయ్యారు "మనం మంచి హోదాలో ఉన్న వాళ్ళంగదా! కనుక 20 మం 30, దిని పిలుస్తే బాగుండదు అన్నాడు. "అయితే ఎంతమందినో మీరు సెలవిస్తే" అని ఆపాడు. యాభై, అరవైమందిని రమ్మనమనండి ఈ మూడురోజులునూ. తరువాత

## బాలగోపాలుని పైన నేరారోపణలు

★

[కృష్ణుని తల్లియైన యశోదయింటిలోనికి గోపికలు ప్రవేశించి యావిగంగా యశోదతో అన్నారు]

రేపల్లెవాడలో గోపెమ్మ మేము
కాపురంబుండి యిక కడతేర లేము.
మా పాలు పెరుగును మననీయడమ్మా
చంటివాడితడంటె! చాలుగోపెమ్మా
బొట్టెలకు పిలిజుట్టు ముడిపెట్టెనమ్మ
యెట్లువేగింతుము యశోద మేము
పుట్టి బుద్ధెరుగని కొడుకెట్టి కొడుకు
కంటిమా! వింటిమా! కలలోననైనా
సఖియా నీకొమరుండు జారుడోయమ్మ
బాలుండుకాడమ్మ పడతి కృష్ణమ్మ
చూడనల్లనివాడు సుకుమారుడమ్మా
కొల్లగాగొనుచుండు గోపికలనెల్లా
చంటివాడితడంటె? చాలుగోపెమ్మా
నీబాల నీకిచ్చు నిష్టదేవతలు
కూర్మితో మాకిచ్చు కోర్కెలలరంగా
జయాభివైభవ! దిగ్విజైభవా!

రు 1000 బహుమానం
లెప్రసీ క్యూర్
(రిజిష్టర్డు)
కుష్ఠు, బొల్లి, సుఖరోగాదులకు
గ్యారంటీ చికిత్స.
అన్ని భాషలలోను కేటలాగు ఉచితం.
లక్ష్మి అండ్ కో
(రిజిష్టర్డు)
H. O. వాల్తేరు. ఆర్. యస్.
బ్రాంచీలు:
2/135 బ్రాడ్వే, మదరాసు.
గాంధినగర్, విజయవాడ.
కటక్, సికింద్రాబాదు.
రాజమండ్రి etc.




హిందీ విద్యాబోధిని
తెలుగక్షరములు తెలిసిన ప్రతివారు ఈ గ్రంథసహాయంవల్ల ఒక నెలలోనే హిందీ భాషను నేర్చుకొనవచ్చును. ఉచ్చారణ,అర్థ వివరణములు తెలుగక్షరములతో యీయబడినవి. హిందీ నేర్చుకొనువారికి ఇది చాల సహాయకారి. వెల 1-4-0 తపాలాఖర్చు వేరు.
ఈశ్వరి కో,
పోష్టుబాక్సు, 139, మదరాసు- 1




# పితృకార్యం అంటే

ఈమూడు రోజులకు మంచి పసందుగా వంటకాలు తయారుచేసే వంటవాడినిగూడ కుదర్చండి. కూరలు, పచ్చళ్లు, పప్పు, చారు, పులుసు, సాంబారు అన్ని రకములైన పిండివంటలు గూడ వచ్చియుండాలి సుమా. మధ్యాహ్నం రండి లెక్ఖతీసికొని వెళ్ళండి అని అన్నాడు.

అయ్యా! నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్లు పప్పు చారు తప్ప మిగతా వంటకాలు పితృకార్యానికి పనికిరావు గోపాలం "(ప్రతీసారీ గోపాలకృష్ణయ్య అంటే కష్టం) ఈమాటలనేసరికి అయ్యరుగారికి అరికాలుమంట నెత్తికెక్కింది. జన్మానికి శివరాత్రి అన్నట్లుగా ఇప్పుడు పితృకార్యం చేయ తలపెడితే పులుసు ముఖ్యంగా సాంబారు పనికిరావంటావేం? అయినా నెమ్మదిగా వారిద్దామని" ఎందుకు పనికిరావు. మావాళ్ళందరికీ ముఖ్యంగా నాకు సాంబారులేందే ముద్దదిగదు. చేసి తీరాల్సిందే అన్నాడు. సరే మీయిష్టం 100 రూ|| అవుతుంది అన్నాడు. ఇప్పుడు ఏడు పదిహేను నిమిషాలయింది కంపెనీకి ఆలస్యమయింది? అని కంపెనీకి పోయాడు. గోపాలం కృష్ణకెళ్ళాడు. తిరిగి మధ్యాహ్నంవచ్చి వందరూపాయలు తీసికెళ్ళాడు.

*　　*　　*

## 2

అమ్మయ్య! ఆదివారం వచ్చింది. ఉదయమయేసరికి విభూతి పిండికట్లు మంచి దిట్టంగా పెట్టి అయ్యరుగారింటికి వెళ్లాడు గోపాలం. ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తున్న తోకయ్య అప్పటికి నీళ్లు పోసుకొని పట్టుపంచ కట్టుకొని, అంగవస్త్రం బిగించుకొని యింటియజమాని పితృకార్యంనాడు ఎలా తయారయ్యాడో సరిగా అలాగ తయారయ్యాడు.

గోపాలకృష్ణయ్య అయ్యరికి "నేనేమంటానో అది అనండి" అని వార్నింగ్ ఇచ్చాడు. కొంతవరకు బాగానే నడిచింది వ్యవహారం.

మధ్యలో అయ్యరుతో "మమ అనండి" అన్నాడు గోపాలం అర్థం సరిగా తెలుసుకోలేని తోకయ్య తిరిగి "మమ అనండి" అని అన్నాడు.

"మమ అనండి అని అనక్కరలేదు. మమ అని మాత్రమే అనండి.

"మమ అనండి అని అనక్కరలేదు. మమ అనిమాత్రమే అనండి."

"వద్దంటే మానరేమి? అయ్యో గ్రహచారమా"

AT LESS THAN HALF PRICE
1,0000 WATCHES BEING OFFERED ON PUJA OCCASION
EACH GUARANTEED 5 YEARS
NO. 15 SIZE 10½
WATER PROOF: SHOCK PROOF
PRICES - ACTUAL & SALE
15 J. STAINLESS STEEL 82/- 40/-
17 J. STAINLESS STEEL 92/- 45/-
NO. 16 SIZE 7¾
5 JEWELS R/GOLD 66/- 29/-
15 JEWELS R/GOLD 80/- 37/8
NO. 17 SIZE 6¾
SUITABLE FOR BOTH GENTS & LADIES
FANCY CHROME 32/- 18/-
4 JEWELS R/GOLD 34/- 20/-
15 JEWELS R/GOLD 56/- 32/-
POCKET WATCH PLANE 25/- 11/-
RADIUM DIAL 30/- 13/-
TABLE CLOCK
SWISS 40/- 18/-
ENGLISH 36/- 16/-
FREE CATALOGUE ON REQUEST
MODEL PEN SUPPLIERS
POST BOX NO. 6772. CALCUTTA

వైబ్రో
గర్భాశయ రోగనివారిణి
సర్వ గర్భాశయ వ్యాధులను పూర్తిగా పోగొట్టి, సత్సంతానమును కలుగజేయుటలో మా వైబ్రో మిక్కిలి ఘనతవహించినది. అన్ని షాపులలో దొరకును.
రు 2-8-0
KL
కృష్ణా లేబరేటరీ
బెజవాడ

# పితృకార్యం అంటే

"వద్దంటె మానరేమి ? అయ్యో గ్రహచారమా !"

"ఇదేమిటండీ ? నామాటవినండీ ! మమ అనండి !"

"ఇదేమిటండీ ? నామాటవినండీ ! మమ అనండి !"

'ఏమండోయ్' అయ్యరుగారూ ! సరిగ్గా అనండీ !

"ఏమండోయ్ అయ్యరుగారూ ! సరిగ్గా అనండీ"

"సర్లెండి ! ఇది మరీ బావుంది! మాట వినిపించుకోరేం"

"సర్లెండి ! ఇది మరీ బావుంది ! మాట వినిపించుకోరేం"

"ఇల్లా అయితే ఎలాగండీ"

ఇల్లా అయితే ఎలాగండీ"

"అబ్బ బ్బ బ్బ ! నా ప్రాణం విసుగుతోంది ! ఇంటికి పొమ్మంటారా ?"

"అబ్బ బ్బ బ్బ ! నా ప్రాణం విసుగుతోంది ! ఇంటికి పొమ్మంటారా ?"

గోపాలంకి తల ప్రాణంతోక కొచ్చినా ఈయన ధోరణీ ఈయనదీ గొంతుక ఆరిపోతోంది. ఈయనతో అరవలేక, ఇదిపని కాదనుకొని కాళ్ళకు బుద్ధిచెప్పాడు. వెనకాలతోకలాగ తోకయ్యగూడ వెంటపడ్డాడు. గోపాలకృష్ణయ్య అలా ఉరకలేసుకొంటూ వెళ్ళి వెళ్ళి శరభయ్యగారి గుడిముందరికి వెళ్ళాడు. అయ్యరు వెనకవెంటాడుతూ అనుపించాడు.

ఇంతకీ అయ్యరు అభిప్రాయమేమిటంటే ! ఈ పరుగులు, ఈ హంగామా అంతా పితృకార్యంలో భాగాలని అనుకున్నాడు. గోపాలం ఇక పరిగెత్తలేక చేసే చేసేదిలేక సేరుగా గుడిలోకి ప్రవేశించి ఈపోరు తగ్గించమని వేడుకుంటూ కనకదుర్గకు సాష్టాంగపడ్డాడు. కారణం తెలియని అయ్యరుగూడ అది ఒక పితృకార్యశేషమని ఊహించి తనూ సాష్టాంగపడ్డాడు.

గోపాలం అలాపడుకొని ఆయాసంతీర్చుకొంటూంటే చక్కని ఆలోచనతోచింది. వెంటనే లేచి 'అయ్యా ! పితృకార్యం ఇంతటితో సరి ! ఇక ఇంటికి వెళ్ళి సంతర్పణచెయ్యటమే తరువాయి. అన్నాడు. అమ్మయ్య ఈ పీడ ఇప్పటికి వదిలిందని సంతోషిస్తూ" సరె ఇంటికి పోదామా అని తిరిగి పూర్ణానంద పేటకి చేరారు.

అప్పటికప్పుడే బ్రాహ్మణులందరు వచ్చి ఈ హంగామాను గురించి తెలుసుకొని పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటున్నారు. అయ్యరు తను ఇంతదూరం పితృకార్యం కోసం శ్రమ అనుకోకుండా పరిగెత్తానని ఆనందిస్తున్నారని తలిచాడు.

వేళాకోళాలతో, వెటకారాలతో, చీదరింపులతో బహు దివ్యంగా సంతర్పణ ముగిసింది.

గోపాలకృష్ణయ్య వెడుతూ "బాబూ ! మీరు మరొక పురోహితుని చూసుకోండి. ఇప్పటికే నాకు కాళ్ళు విపరీతంగా లాగుతున్నాయి. ఇంక రేపూ ఎల్లుండీ గూడ పరిగెత్తానా మర్నాటికి పైసలా. ఇంక శెలవు ఇవ్వండి మహాప్రభూ" అన్నాడు. అయ్యరు "నేనుమాత్రం ఇంత కష్టమని తెలిస్తే, చివరకి తోస్తేగూడ చేస్తానా? కాళ్ళు నా స్వాధీనంలో లేవు, రేపు కంపెనీకి ఎల్లా వెళ్ళాలో తెలియదు. కనక బ్రాహ్మలను ఇంక రావద్దని చెప్పండి. వంటవాడికి ఈ మూడురోజులకి ఒప్పన్నం అయింది కనక ఏంచేస్తాం మూడు రూపాయలు ఇచ్చేయండి అన్నాడు దీనంగా కాళ్లు పిసుకుకుంటూ.

గోపాలకృష్ణయ్య "నేను మళ్ళీ మీ యింట్లోకివచ్చి మంత్రం చెబితే నా పేరు తంగిరాల గోపాలకృష్ణయ్య కానేకాదు" అని సవాలు చేశాడు. అందుకు అయ్యరు "నేనుతిరిగి ఎప్పుడైనా పితృకార్యం తలపెడితే నా పేరు కుమారయ్యరు కాదు అన్నాడు. మరి నేనేమన్నానో తెలుసా బాలలూ ! నాకు ఈ కథకి బహుమతి ఇవ్వకపోతే తిరిగి ఎన్నడూ కథలు వ్రాయను అని అంటున్నా, మరి మీరేమంటారో చెప్పండి. ★


## రత్నపురుషవేహం

సువర్ణము, క్యాల్షియములు కలిపి తయారుచేయబడినది. శుక్లనష్టము, గుండెదడ, నరముల బలహీనము అతిమూత్రము మొ॥ మేహ వ్యాధులను హరించును. బలమును, కాంతిని, ధాతుపుష్టిని, యిచ్చును అనేక యోగ్యతా పత్రాల కలవు. తపాదు. 3.12.0 వి. పి. అ. 14.

ఇండియన్ మెడిసన్ హౌస్,
లక్ష్మీటాకీసు రోడ్డు - విజయవాడ—2.



## కుష్ఠు ★ బొల్లి

తగ్గిరా మేహమచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు, గ్యారంటి చికిత్స, కోటలాగు ఉచితం. జి. వి. రెడ్డి అండ్ కో., (రిజిష్టర్డు) "భాస్కరాశ్రమము" గోపాలపురం, తూ. గోదావరి.


## పిల్లలు చేసే స్తుతి



ధరసింహాసనమై నభంబుగొడుగై
తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్లవందిగణమై
బ్రహ్మాండ మాకారమై
సిరిభార్యామణియై విరించికొడుకై
శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్నీఘనరాజసంబు నిజమై
వర్ధిల్లు నారాయణా !

(బమ్మెరపోతన్న గారు వ్రాసిన నారాయణ శతకంలోని పద్యం)

శ్రీహరి కరుణాకటాక్ష వీక్షణా
లంకార

ఆర్థిజన కుముద చంద్రోదయ !
ఆశ్రిత విద్వజ్జనాధార !
సత్యభాషా హరిశ్చంద్ర !
సంగీత విద్యానారద !
సాహిత్య విద్యా చతుర్ముఖ !
దానరాధేయ !
సంగ్రామ ధనంజయ !
సాహస విక్రమార్క !
శత్రుగజకంఠీరవ !
చాతుర్యధురీణ !
విజితారి కోలాహల !
కదనవిజయ మార్తాండా
కలియుగభీమ !
కామినీపంచబాణావతార !
దీనజనమందార !
జయాభిజై భవ !
దిగ్విజై భవ !



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి





పక్షులు చెప్పిన దీన గాథతో
గరుడుని మనస్సు కరిగిపోయినది
ఇంతట్లో వైకుంఠం నుంచి
"రక్కసి మూకతో పోరాడాలట;
విష్ణుమూర్తి మిము రమ్మన్నార"ని
వార్తాహారుడొకడొచ్చాడు.



"అల్పపు పక్షుల జాతికి చెందిన
నేనెందుకు పనికొస్తానయ్యా?"
"అదేమిస్వామీ! అల్లంటారు?
కోపం గిపం రాలేదు గదా!"
అప్పుడు తీతువు పక్షుల గాథను
గరుడుడు దూతకు
చెప్పాడు



ఇది అంతా ఆ దూత చెప్పగా
విష్ణువు ఎంతో విషణ్ణుడై
సంగతేమిటో కనుగొందామని
గరుడుని వద్దకు వచ్చాడు



విష్ణుమూర్తితో జరిగినదంతా
గరుడుడు మెల్లగ చెప్పాడు
ఎల్లాగైనా సముద్రుడికి గుణ
పాఠం చెప్పాలన్నాడు



కరుణామయుడగు
కాంచనచేలుడు
అట్లే చేస్తానన్నాడు.



అందరినీ తన వెంటబెట్టుకుని
సముద్రతీరం చేరాడు
ఆగ్నేయాస్త్రం సంధించి
సముద్రరాజును పిలిచాడు



గడగడ వణుకుతు, నురుగులు కక్కుతు
సతీసమేతుడు సముద్రుడప్పుడు
విష్ణువు కాళ్ళను పడ్డాడు



"ఏమయ్యా! ఓ సముద్రుడా! ఈ
పక్షులనెందుకు బాధించావ్?"
"పొరపాటైనది పురాణపురుషా!
వేళాకోళంకోసం చేశా
మీదాకా వస్తుందని
తెలియదు-క్షమించి
వదులుము. క్షమావల్లభా!"



అంటూ లెంపలు వాయించుకుని
తీతువు గుడ్లను తీసుకు రాగా
విహంగకులమూ, వినతాసుతుడు
ఎంతో సంతోషించారు



పోయిన గుడ్లూ తిరిగి పొందగా
తీతువు పక్షులు తొల్లిటి గూటికి
చేరి హాయిగా వున్నాయి



దమనకుడు: "అల్లాగే ఓ సంజీవయ్యా!
తీతువు పక్షుల మాదిరిగానే
యుద్ధంకంటే తేలికమార్గం
నువ్వు కూడా వెదకాలయ్యా!"
"మార్గం ఏదో నువ్వే చెబుదూ!"



"ఈ రోజున పింగళకుని వైఖరి
సరిగా వుంటే ఫరవాలేదు.
నీపై కొరకొరలాడుతువుంటే
ఏదో మోసం తలపెట్టాడని
తెలుసుకు మెసలుట మేలోయి!"



పంచతంత్రం

# మిత్రభేదం





దమనకుడిట్లా మాయమాటలతో పింగళకునికీ, సంజీవకునికి గాఢ విరోధం పుట్టించి కరటకు నొద్దకు వెళ్లాడు













వెనుకటికొక అడవిలోన వజ్రదంతుడను సింహం మాంస వక్త్రుడను తోడేల్ ధూర్తుడను జంబుకమూ దీర్ఘకర్ణుడను ఒంటె కలిసి మెలిసి వుండేవి



ఒకనాడా వజ్రదంతు డొక కరితో పోట్లాడుతు ఒళ్లంతా గాయాలై గుహలోనే పడివుండెను. ఆకలేసి సేవకులను ఏదైనా తెమ్మనెను



ఒంటె మాంసమారగింపు మనసు కలిగి నక్క బావ ఒంటె తోడ యిట్లన్నది




సింహం కడకరిగి ఒంటె తన దేహంపై జన్మలో రెండింతలు అయేట్లయితే తప్పక తను యిప్పుడు చని పోతానని చెప్పింది



ఆకలితో మాడుతున్న సింహం ఆట్లాగే నని ఒంటెను చంపేసింది.




సింహం అటు పోగానే:-




అమాయకప్పు తోడేలూ ఒంటె గుండె కాయ తీసి తిన బోతూ వుండగాను




ఒంటె ఒంటిలోన గుండె లేకుండుట చూచి రాజు కోపంగా గర్జించగ తెల్లబోయి తోడేలూ పిక్కబలము చూపింది



సింహం తిన బోతుండగ ఒంటెలపై బేహారులు ఎక్కడికో పోతూ ఆ దారి వెంట వచ్చారు. ఆ చప్పుడు విని సింహం గడగడ గడ వణకింది.



నక్క పోయి చూచి వచ్చి- "ఇంకేముందం డోయ్! మీ- రొంటెను కడతేర్చారని- కోపమొచ్చి మృత్యుదేవి- మీమీదికి వస్తోంది!" - అనగానే ఆ సింహం- పిక్క బలము చూపించగ- నక్క అపుడు ఒంటె మాంస- మంతా తనె మెక్కింది.





# డాన్ క్విక్‌సెట్

## పూర్వకథ

లామంచా అనే గ్రామానికి చెందిన డాన్ క్విక్‌సెట్ అనే వెర్రివెంగళప్ప తానొక వీరుడుగా చెలామణీ కావాలనుకొని, శాంకో పాంజా అనే చదువురానివాణ్ణి తన బంటుగా చేసుకొని వీరవిహారాలకు బయలుదేరాడు. ఎవరో ఒక ఆడామెనుచూచి ఆమెకు డల్‌సీనియా రాకుమారిఅనే బిరుదాన్ని తనమనస్సులోనే యిచ్చేసి, ఆవిడను మెప్పించటంకోసమే తానీ ధర్మరక్షణమనే కఠోరదీక్షను స్వీకరించానని నమ్మాడు. ప్రథమ క్షేత్రయాత్రలో యీయనకు అన్నీ పరాభవాలే అయినాయి. ఇంటికి తిరిగివచ్చి వస్థనయమయ్యాక మళ్ళీ ద్వితీయ యాత్రకు బయలుదేరివెళ్లాడు.

లోగడ డాన్ క్విక్‌సెట్ గారు తాను జయించబోయే దీవుల్లో ఒకదానికి శాంకో పాంజాను గవర్నరుగా చేస్తానన్నాడు. వాడా మాట నమ్మి ఆరోజుకోసం ఎదురు చూస్తున్నాడు.

ఇలా వుండగా ఒకరోజు వీళ్ళకు ఒక డ్యూక్ దంపతులు తారసిల్లారు. వారికి వీళ్లిద్దరినీ వేళాకోళం చేయాలనే బుద్ధి పుట్టింది. ఆ స్వామినీ, బంటునీ తమ కవిడీకి తీసుకుపోయి. తిండి అదీ పెట్టి బాగా ఆదరించారు. అప్పుడు జరిగిన ఆ మాటల సందర్భంలో శాంకోపాంజాను తానే ఒకానొక దీవికి గవర్నరుగా నియమించేస్తున్నానని ఆడ్యూక్ సెలవిచ్చాడు.

## 16

శాంకో పాంజాగాడు (కాదుకాదు - ఆయన గవర్నరుకాబోతున్నారు కనుక మనంకూడా ఆయనను యిక గాడు, గీడు అనరాదు)—ఘనత వహించబోయే గవర్నరు శాంకో పాంజాగారి మాట తీరుచూసి ముచ్చటపడిన డ్యూక్ భార్య ఆయనను తనకూడా అంతఃపురంలోకి తీసుకువెళ్ళింది. తానొక వున్న ఆసనంమీదకూర్చొని, ప్రక్కనే ముక్కాలి పీట ఒకటివుంటే, దానిమీద యీ కాబోయే గవర్నరుగారిని కూర్చోమన్నది. తానింకా గవర్నరు కాలేదుకదా అటువంటప్పుడు యిలాంటి గొప్పవారితో సమానంగా కుర్చీలమీద, సోఫాలమీద కూర్చోవటం ఎందుక్కు లెమ్మని శాంకో పాంజాగారు అనుకొని, అలా నిలబడే వుండిపోయారు. ఆవిడమాత్రం అందుకు ఒప్పుకోలేదు. "డ్యూక్ నిన్ను గవర్నరుగా చేస్తామన్నారుగా. ఇకనేం? దర్జాగా మహారాజులాగా ఆపీటమీద కూర్చో. కూర్చోవటం గవర్నరులా కూర్చొన్నా నాతో మాట్లాడేటప్పుడుమాత్రం మామూలు శాంకో పాంజాలాగే - అంటే వీరకేసరి డాన్ క్విక్‌సెట్‌గారి నమ్మిన బంటులాగే మాట్లాడాలిసుమా" అని వేళాకోళంచేసింది. మొత్తానికి ఎల్లాగైతేనేం పట్టి బలవంతాన ఆయనను ముక్కాలి పీటమీద కూర్చోపెట్టేసింది.

ఆ మాటా యీ మాటా మాట్లాడుతూ డాన్



మూలం : సెరివాన్‌టిజ్  అనువాదం: శ్రీ వ్యాకోత్సల నరసింహమూర్తి

క్విక్ సెట్ గారినిగురించి తనను పట్టుకు వేధిస్తున్న ఒకటి రెండు అనుమానాలు నివృత్తిచేయమని యీాయనను అడిగింది. డాన్ క్విక్ సెట్ గారి వీరవిహారాలనుగురించి పత్రికలలో ఎప్పటికప్పుడు పడుతున్నవి కదా! అవి చదువుతూవుంటే తనకు ఆ అనుమానాలు తగిలాయని చెప్పింది.

ఆపిడ ఆ రెండు అనుమానాలను గురించీ బైట పెట్టేసరికి శాంకో పాంజాగారు, నోటిమీాదికి చూపుడువేలు అడ్డంగాపెట్టి 'యిస్' 'యిస్' అన్నారు. పిల్లికి మల్లే చప్పుడు చెయ్యకుండా అడుగులు వేసుకొంటూ పోయి అక్కడవున్న కిటికీలన్నిట్లో నుంచీ తల బయటకుపెట్టి పరాయి వారెవరైనా వున్నారేమోనని చూశారు. కిటికీలకీ, తలుపులకీ వేలాడ గట్టివున్న తెరలు అవీఅన్నీ తొలగించి వాటి చాటున ఎవరైనా దాక్కొని వున్నారేమోనని పరీక్షగా చూశారు. ఒకటికి రెండుసార్లు మూలమూలలు కూడా గాలించి చూసి, ఎక్కడా ఎవరూ లేరని తన మనస్సుకు బాగా నమ్మకం తోచాక తిరిగివచ్చి యథాస్థానంలో కూర్చొని, ముందుకు వొంగి "చూడండి అమ్మా! ఈ చుట్టుపట్ల పరాయివారు ఎవరూ లేరు కాబట్టి, మీారు అడిగిన వాటికి సమాధానం చెప్పటానికి సాహసిస్తున్నాను. అన్నిటికంటే ముందు నేను తమకొక గొప్ప రహస్యాన్ని చెప్పవలసి వున్నది. జాగ్రత్తగా వినండి...మళ్లీ యీామాట మరెవరితోనూ అనబోకండేం...మా యజమాని వున్నారే — ఆ డాన్ క్విక్ సెట్ గారు, ఆయనగారికి పూర్తిగా పిచ్చి ఎత్తిందని నాకో గట్టినమ్మకం. అంత పిచ్చి ధోరణిలో వుండీ కూడా ఒకొక్కప్పుడు ఆయన ఎంత బాగా మాట్లాడుతారనుకొన్నారూ ? తర్కం చదివిన పండితుల కంటెకూడా యీాయన చాలా చమత్కారంగా మాట్లాడుతారు. ఆయనకు అంత పిచ్చి పట్టిందా ?— అయినా ఆయనమాటలు వింటూ వుంటే 'యీాయనకు పిచ్చేమిటి' అనిపించేటంత తెలివి తేటలుగా కూడా మాట్లాడుతారండీ. కాకపోతే — ఒకవిషయం— ఆయనకు అంతలావు పిచ్చి పట్టింది కనుకనే, ఆయనచేత ఏ విషయాన్నైనా యిట్టే నమ్మించవచ్చు. లేకపోతే—డల్ సీనియా రాకుమారి మాంత్రికుడి ప్రభావంచేత పల్లె పడుచుగా మారిపోయిందని నేను అన్నంత మాత్రంచేత ఆయన నమ్మేవారా? మనిషిలో దోసకాయంత పిచ్చి వుండబట్టే నా ఆడిన ఆమాటను నమ్మి మిన్నకవున్నారు" అన్నారు.

"ఏమి టేమిటీ? డాన్ క్విక్ సెట్ గారు నిజంగానే పిచ్చివాడన్నమాట...అది సరేకానీ ఆ మంత్ర ప్రభావం అంటున్నావే — దాన్ని గురించి సరిగా వివరించి చెప్పు" డ్యూక్ గారి భార్య కోరి అడిగింది.

శాంకో పాంజాగారు తాము ఆనాడు బయలు దేరినది మొదలుకొని డల్ సీనియా రాకుమారితో డాన్ క్విక్ సెట్ గారు సమావేశమయ్యే పర్యంతం కథ అంతా వివరించిచెప్పి, ఆవిధంగా ఎదురైన కన్య డల్ సీనియా కానే కాదనీ, ఎవరో పల్లెపడుచు ఆదారిని వస్తుంటే, తనే ఆ వీరుణ్ణి ఏడిపించటానికి ఆవిడే డల్ సీనియా అని చెప్పి నమ్మించాననీ చెప్పుకొచ్చారు. ఈయన చెప్పిన కథను ఆసాంతం విని "అయితే నాకు తెలియక అడుగుతాను !— నీ యజ

## పిల్లలకోసం గాంధీజీ చెప్పిన మాటలు

"మనం కావా లనుకొన్నదల్లా చేయలేం; ఏది కావాలనుకొంటే అది చేయగల శక్తి మానవుడికి అధవా వుంటే - ఇప్పటి కప్పుడే యీామాదిరి భూగోళాలు ఎన్ని తయారయ్యేవో, మరెన్ని మట్టి కలిసిపోయేవో!

—కాబట్టి సిరిసంపదలలోకల్లా సంతుష్టి అనేదీ అన్నిటికీ మించిన సిరీ, సంపదాను."

* * *

"మనం ఏ ఒక్క విషయానికీ యితరులపై ఆధారపడి వుండకూడదు ; అయినప్పటికీ ఎవరైనా ఏదైనా మన కొక సహాయం చేసినప్పుడు వారికి మనం కృతజ్ఞులమై వుండాలి."

* * *

# డాన్ క్విక్ సెట్

మాని ఆ డాన్‌క్విక్ సెట్‌గారు పిచ్చివాడనే నమ్మకం నీకు బాగా వున్నదని చెప్పుతున్నావు కదా! అయినా ఆయనను వదిలి పెట్టకుండా అంటిపెట్టుకు తిరుగుతునే వున్నావు కనుక నీవు ఆయనకంటే కూడా వెర్రివాడివై వుండాలి. తనను తానే ఒక హద్దులో పెట్టుకోలేని యింత వెర్రివాడవు, అంత పెద్ద దీవికి ఎల్లా గవర్నరువై, ఎల్లాగ అంతమంది అమాయిక ప్రజల ప్రాణాలు కాపాడగలవో నాకు అర్థం కావటంలేదు" అంటూ తనకుతోచిన అనుమానాన్ని తానూ వెళ్ళబెట్టింది.

"అమ్మగారూ! తమరు నిజం సెలవిచ్చారు. మీరుచెప్పినదాంట్లో ప్రతి అక్షరం కోట్లకొలది విలువైనది. అవును - నేనే కనక నిజంగా తెలివి మాలిన మనిషిగా పుట్టివుంటే యిలాంటి పిచ్చి యజమాని దొరికినందుకు నన్ను నేను తిట్టుకొని, ఎప్పుడో ఆయనతో తెగతెంపులుచేసుకొని, నా బ్రతుకు ఏదో నేనే చూసుకోవలసింది. కానీ నేను అలా చేయలేదు. అలా చేయలేనుకూడాను! ఏమంటారా? - ఆయనదీ నాదీ ఒకేవూరు. ఆయనపెట్టిన వుప్పుతిన్నాను: ఆయన పోసిన పులుసుతాగాను. అందుకని ఆయన అంటే నాకు అపారమైన విశ్వాసంవున్నది. కనుకనే ఒక్క మృత్యువు తప్ప వేరెవ్వరూ మమ్మల్నిద్దర్ని యీ జన్మలో వేరుచేయలేరంటే నమ్మండి. ఆయన పిచ్చివాడైతే అయ్యారు. ఆయన వుప్పుతింటున్నాను కాబట్టి ఆయనను అంటిపెట్టుకు వుంటున్నాను. ఇదే కారణంగా మీరు నాకు గవర్నరుపదవి యీయతగదనుకొంటే - మంచిదే! నేనా-పుట్టు దరిద్రుణ్ణి. అటువంటి నేను గవర్నరు పదవికి తగనేమో అన్న దిగులు ఎందుకుపడాలి? ఆ కారణంగా నా ఆత్మను ఎందుకు క్షోభపెట్టుకోవాలి? మరొక్కవిషయం. అర్హతలు అనర్హతలన్నవి మనిషి బ్రతికివున్నంతవరకే. ఆ తరువాత ఏవీలేవుకదా! చచ్చాక మహారాజుకైనా కావలసింది ఆరుఅడుగుల స్థలమే. బిచ్చగాడికీ ఆ అరుఅడుగుల స్థలమేసరిపోతుంది. ఇంకొక విషయం - 'తెల్లటివన్నీ పాలు నల్లటివన్నీ నీళ్లు కావ'ని పెద్దలు అన్నారు. అలాగే 'మెరిసేవన్నీ మేలిమికావ'న్నారు. ఇంకా - "పైమెరుగులుచూసి మోసపోవద్ద"న్నారు. ఇంకా యిలాగే పెద్దలు చాలా చాలా సామెతలుచెప్పారు. మచ్చుకి మరికొన్ని జ్ఞాపకం తెచ్చుకుచెప్పుతాను; వినండి." అంటూ బుర్ర గోక్కూంటూ సామెతలు జ్ఞాపకంచేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ దశలో గనుక డ్యూక్ భార్య ఆయన ధోరణికి అడ్డురాకపోతే, యిక ఆయన ఏకరువుపెట్టే సామెతలకు అంతుఅన్నది వుండేదికాదు. సామెతలు ఏకరువుపెట్టటమంటే, కాబోయే గవర్నరు శాంకో పాంజాగారికి వల్లమాలిన యిష్టం. ఆ విషయం గమనించేకాబోలు ఆవిడ ఆయనగారి మాటల ధోరణికి అడ్డువచ్చి "ఇదిగో! ఇటుచూడు. వీరుడు ఆడిన మాటకు తిరుగు వుండదుకదా? మా ఆయన వీరుడు కాకపోయినా, వీరకంకణం కట్టించుకోకపోయినా, వీరు


రు. 1-14-0 లు మాత్రమే పెట్టుబడి పెట్టి
రు. 1024/-లు సంపాదించండి
వివరములకు వ్రాయండి.
ఇండియన్ నేషనల్ పాలిసీ కంపెనీ
(Money Circulating Scheme)
పో. బా. నం. 889 జి. పి. ఒ. కలకత్తా 1,
స్థాపితము — 1935
ఇండియాలో ఇటువంటి కంపెనీలలో ఇదే మొదటిది. స్థాపింపబడినప్పటినుండీ ఈ కంపెనీ ఎక్కువపేరు ప్రఖ్యాతులతో ప్రజలకు సేవ చేయుచున్నది.

మిత్రాంజనము
(రిజిష్టర్డు)

నొప్పులకు
బాధలకు
కాల్పులకు
దివ్యాంజనము
అన్నిమందుషాపులలోను దొరకును
ఏజంట్లు కావలయును
మిత్రఫార్మసీ [రిజిష్టర్డు]
తెనాలి. M & S. M. Ry

# డాన్ క్విక్ సెట్

డంతటి ఆసామి. కాబట్టి ఆయన మాటకూ తిరుగు వుండదు. ఆయన అన్నమాట జరిపితీరుతారు. ఏది ఏమైనాసరే - ఒకసారి 'నిన్ను ఫలానిదీవికి గవర్నరుగా చేస్తాను' అని ఆయన అన్నతరువాత ఆదీవికి నిన్ను గవర్నరుగా చేశారన్నమాటే! ఇక ఆ విషయంలో మాత్రం నువ్వు నీ మనస్సులో ఎంతమాత్రపు అనుమానమూ పెట్టుకోకు. అంతెందుకు! ఎప్పుడో ఒకరోజు వున్నట్లుండి నువ్వు గవర్నరుగారు కూర్చునే సింహాసనంలో వుంటావు - చూసుకో! ఇప్పుడు నేను చెప్పుతున్నానుకదా! ఆ క్షణంవరకూ నీకు తెలియకుండానే వుంటావు. ఎప్పుడో అంతా గమ్మత్తుగా, గారడీలాగా జరిగిపోతుంది, నీ పట్టాభిషేకం. కాకపోతే- ఒక్కవిషయంమాత్రం మనసులో వుంచుకో. నీవు గవర్నరు కాబోయే దీవిలో మర్యాదస్తులైన పెద్దపెద్ద వాళ్లు ఎందరోవున్నారు. వాళ్లతో మాట్లాడేటప్పుడు ఎలా మాట్లాడాలో, వాళ్ళతో వ్యవహారాలు ఎలా నడపాలో ఆ విషయంమాత్రం జాగ్రత్తగా చూసుకో." అంటూ ఆవిడ యీయన ఆశలను రెచ్చగొట్టి అభయహస్తం యిచ్చింది.

ఇలాగే మరికొంతసేపు ఆ గవర్నరు గిరీని గురించిన సంభాషణలు జరిగాక ఆవిడ శాంకో పాంజా గారిని పోయి కాసేపు విశ్రాంతి తీసుకోమని సెలవిచ్చింది. మొత్తానికి తనకు గవర్నరు గిరీ రాబోతున్నదనే విషయం యీవిడగారి నోటిచలువ వల్ల మరింత బాగా రూఢి అయినందువల్ల శాంకో పాంజాగారు మనస్సు మరీ బాగా తేలిక పడింది. ఆ సంతోషం కొద్దీ ఆవిడకు వొంగి వొంగి దణ్ణాలు పెట్టారు. తానిక కాసేపు పడుకొంటాననీ, తాను మళ్లా నిద్దర లేచేవరకు ఆ అమాయకపు ప్రాణి డాపుల్‌ను కాస్త పదిలంగా చూడమనీ ఆవిడను బ్రతిమాలారు.

ఆపేరు వినగానే ఆవిడ వులిక్కిపడి, 'డాపుల్' ఎవరని అడిగింది. డాపుల్ అనేది తన గాడిదకు తాను ముద్దుగా పెట్టుకొన్నపేరు అనీ, ఆ గాడిదను తను తన ప్రాణంతో సమానంగా చూచుకొంటున్నాననీ శాంకో పాంజాగారు తేట తెల్లంగా చెప్పారు. అందుమీదట ఆవిడ ఆ డాపుల్ యోగక్షేమాలను చూచే బాధ్యత తమపై వదిలిపెట్టి శాంకో పాంజాగారు నిర్భయంగా నిద్రపోవచ్చని సెలవిచ్చారు. నిద్రపోయేటప్పుడే కాదు, — రేపు గవర్నరు వుద్యోగానికి పోయినప్పుడు కూడా ఆగాడిదను నిక్షేపంలా యిక్కడ వుంచి వెళ్ళవచ్చునని అంటూ, ఆ విధంగా చేసేట్లయితే 'యింత కాలం యీయనను మోయటంతో అలసిపోయిన ఆగాడిద ప్రాణం కొంత తేరుకొని బాగుపడుతుంద'ని కూడా ఆవిడ సలహా యిచ్చింది. శాంకో పాంజాగారికి చాలా సంతోషమైంది. ఏదో తనను నమ్ముకొని యింతకాలం తనతో పాటే వుంటున్న ఆ గాడిదకు యిప్పుడు యీ విధంగానైనా కాస్త మంచిరకం గడ్డీ, పూర్తిఅయిన విశ్రాంతి దొరుకబోతున్నందుకు ఆయన చాలా సంతోషించి, అక్కడనుంచి లేచి తనకోసం ప్రత్యేకం ఏర్పాటైవున్న గదికి పోయి నడుం వాల్చారు.

శాంకో పాంజా తప్పుకొన్నాక డ్యూక్ భార్య కూడా కూర్చొన్న చోటినుంచి లేచి భర్తను వెతుక్కుంటూ వెళ్ళింది. తనకూ శాంకోపాంజాకు యింతసేపూ జరిగిన ఆ సంభాషణ అంతా చెప్పి, వీళ్లతో యీ వేళాకోళం యింకా యింకా ఏ ఏ విధంగా కొనసాగించాలో అదంతా ముందుగా ఆయనతో ఆలోచించాలని ఆవిడ తొందరపడింది. (ఇంకా వుంది)




హిందూదేశమంతటా దొరకును

# జంతుకోటిలో మానవలక్షణాలు

(గతసంచిక తరువాయి)

చదువుకొనే పిల్లలకు అయితే—'జాగ్రత్త! సరిగా చదువకపోయావంటే పరీక్ష తప్పిపోతావురా, వెధవా?" అంటే వాళ్లు కొంతవరకు పట్టుదలగా చదువుతారని ఆశపడవచ్చు. (పెద్దలు పెట్టుకొన్న ఈ ఆశ అనేకమంది పిల్లలవిషయంలో వట్టి నిరాశగా తయారుఅవటం అరుదు కాదు!) పెద్దలు పెట్టిన యీ బెదురుకు లొంగే గుణం పిల్లలలో వున్నంతవరకు వాళ్ళు పరీక్షల విషయంలో పట్టుదలగా వుండవచ్చు. కానీ పరీక్షించదలచుకొన్న జంతువును తీసుకొచ్చి, దాని పరీక్ష ప్రాముఖ్యత బోధపడేలా చేయాలన్నా, భయపడేలా చేయాలన్నా ఏం చేయగలం! కోడిపిల్లను పట్టుకొని "ఇదుగో! నువ్వు గనుక బుద్ధిగా నడుచుకోక పోయావా పరీక్షలో 'ఫైల్' అయిపోతావ్!" అంటే మాత్రం దానికి ఏం అర్థం అవుతుంది. కుక్కల విషయంలో ఒక సులువు వున్నది. అది తను కావాలనుకొన్న మనిషి ఎవరైనాసరే తను చేసిన పనిచూసి సంతోషించి 'సబాస్' అని తల నిమిరితే చాలు.. దానికి అంతకంటే కావాల్సింది ఏమీ లేదు. ఆ కాస్త మెప్పుదల పొందటం కోసం కుక్క ఏ పని అయినా చేస్తుంది. ముఖస్తుతి అంటే యింత మక్కువ వున్న ప్రాణి కనుకనే కుక్క చేత తన యింటికి 'కుక్క కావలా' కాయించుకొంటున్నాడు మానవుడు. చింపాంజీలు ఎంతలావు పరీక్షకైనా, కేవలం తనను పరీక్ష చేయవచ్చిన ఆ పెద్దమనిషి చేతినే కుప్పిగంతులు వేయించవచ్చునన్న సరదాకొద్దీ, యిట్టే పూనుకొంటాయి. ఇక మిగతా మృగాలన్నిటి విషయంలో వాటి తెలివితేటలు కనిపెట్టాలని కుతూహలపడే శాస్త్రజ్ఞులకు ఏంచేస్తే అవి పరీక్షకు సంసిద్ధమౌతాయా అనేది ఒక పెద్ద సమస్య.

సామాన్యంగా తిండిఆశ పెట్టి ఏ జంతువు తెలివితేటలనైనా పరీక్షించవచ్చు. కానీ ఆ తిండి అయినా, రోజూ అవి తిని తిని మొఖం మొత్తిపోయిన తినుబండారాలైతే, ఆ పప్పులేమీ వాటిదగ్గర వుడకవు. రోజూ తినే ఆ చచ్చుతిండికోసం యివి తమ తెలివితేటల్లో పీసమెత్తుఅయినా వుపయోగపెట్టవు. అందుకని వాటికి వున్న తెలివితేటలు పూర్తిగా బయటపడేట్లు చేయాలంటే, ముందుగా ఏ జంతువుకి ఏ తినుబండారమంటే జిహ్వాచాపల్యం జాస్తిగా వుంటుందో గుర్తెరుగాలి. ఉదాహరణకి - కోతులు ద్రాక్షపళ్లు అంటే నాలిక పీక్కుంటాయి. వాటిని సంపాదించుకోవటానికి ఎంత కష్టపడమన్నా పడతాయి. అందుకనే కోతుల తెలివితేటలను పరీక్షకు పెట్టేటప్పుడల్లా శాస్త్రజ్ఞులు ద్రాక్షపళ్ళనే ఎరలుగా చూపిస్తారు. కుక్కమూతి కోతులు కొన్ని వున్నాయి. వాటిని 'బాబూన్లు' అంటారు. వాటికి మామూలుగా కారెట్ దుంపలూ, ఆకుకూరలు పెడితే యిష్టంగా తింటాయన్న మాటేకాని, వీటికోసం తమ తెలివితేటలను పరీక్షకు పెట్టమంటే ససేమిరా వాటి జోలికే పోవు. "ఆఁ! ఈ అంబలికూటి కోసం అంత కష్టపడకపోతే ఏం కొంప మునిగింది లెస్తు" అన్నట్లు మిన్నకుంటాయి. రేగుపళ్లు, ద్రాక్షపళ్ళు యివ్వజూపితేనే యివి కాలు కదుపుతాయి.

ఒకానొక విశ్వవిద్యాలయంలో మానసిక శాస్త్రవేత్త ఒకడు ఒక చింపాంజీకళ్ళెదుట అరటిపండు నొకదానిని చేత్తో పట్టుకు ఆడించినంతసేపు ఆడించి, అది చూస్తుండగానే ఆ పండును ఒక కొయ్యపెట్టెలో దాచేస్తున్నట్లు నటించి, తాను కొంచెందూరంలో పోయి నిల్చొని చూస్తున్నాడు. ఆ పెట్టె వుండడమైతే చింపాంజీకి అందుబాటులోనే వున్నది కానీ, అది తెరవటానికి కొంచెం తెలివితేటలు వుపయోగించాలి. అరటిపండును చూచి లొట్టలువేస్తున్న ఆ చింపాంజీ వెంటనే పెట్టెమీదికి ఎగబడి దాన్ని బలవంతాన తెరవటానికి తంటాలుపడింది. ఆ పెట్టె బలవంతంగా తెరిస్తే వచ్చేది కాదు; బుర్ర వుపయోగించి మీట నొక్కితే యిట్టే తెరుచుకొంటుంది. ఆ చింపాంజీ కొంతసేపు పెనుగులాడి ఎలాగైతేనేం చివరకు తెలివితేటలు వుపయోగించి పెట్టె మూత తెరిచింది. ఇంత కష్టపడి పెట్టె మూత తెరిచి చూస్తే, అందులో అరటిపండు వుండటానికి బదులుగా పాడు బచ్చలిఆకు వున్నది. (అసలు రహస్యం ఏమిటంటే ఆ శాస్త్రకారుడు అరటిపండును యిందులో దాచినట్లే దాచి, గుట్టు చప్పుడు కాకుండా దాన్ని తీసేసి యింత బచ్చలి ఆకు పడేశాడు.) బచ్చలిఆకు యిది ప్రతిరోజూ తినేదేనాయె! ఇంతసేపూ తను పెనుగులాడితే అంత ఆశపడ్డ అరటిపండుకు బదులు యీ చచ్చు బచ్చలిఆకు వుండటం చూసి అది మండిపోయింది. ఆ ఆకునంతా కట్టకట్టి విసిరిపుచ్చుకు పారేసి, యింకా ఆ పెట్టెలోనే ఏ మారుమూలనన్నా ఆ పండు దాక్కొని వున్నదేమోనని తెగ గాలించింది.

ఆకలిగొన్న ఎలుక నొకదానిని, అప్పుడే కడుపునిండా మెక్కి వున్న మరొక ఎలుకనీ పట్టుకుని శాస్త్రజ్ఞుడొకడు ఒకే మాదిరిగా వున్న రెండు బోనుల్లో పెట్టి, రెంటినీ పక్కపక్కనే పెట్టాడు. ఈ బోనుల్లో మీట నొకదానిని అమర్చి, అది నొక్కినప్పుడల్లా యింత అన్నపుముద్ద వచ్చి బోనులో పడే ఏర్పాటు చేశాడు. ఆకలిగొన్న ఎలుక వున్నచోట వుండకుండా బోను అంతటా తిరిగి తిరిగి చివరకు యీ మీట నొక్కితే తనకు కావలసిన తిండి వచ్చి పడుతుందని తెలుసుకొని అదేపనిగా మీట నొక్కుతూ కూర్చొంది. ఇవతల యీ బోనులో తోటి ఎలుక యిలా తెలివితేటలు వుపయోగించి తిండి సంపాదిస్తూ వున్న వైనం తన కళ్ళతో చూస్తూ వుండి కూడా, రెండో బోనులో వున్న ఎలుక కడుపు నిండివున్న కారణంచేత కాలు కదపకుండా కడుపులోవున్న ఆహారాన్ని జీర్ణం చేసుకోవటంతోనే తృప్తిపడిపోయింది. ఆ కథ అంతటితో ముగియలేదు. కడుపునిండిన ఎలుక కదలకుండా కూర్చొంటే ఎలా? అనుకుని అది వున్న బోనులో చిన్న ఎలక్ట్రిక్ షాక్ తగిలేట్లు అదివరకే ఒక ఏర్పాటు చేసివున్నది. ఈ ఎలుకను ఎలాగైనా చురుకు ఎక్కించాలని పంతంపట్టిన ఆ శాస్త్రజ్ఞుడు దానికి ఎలక్ట్రిక్ షాక్ తగిలేట్టు చేశాడు. ఇక చూసుకోండి—అంతసేపూ కడుపులో నీళ్ళు కదలకుండా కూర్చొన్న యీ ఎలుక శివమెత్తి నృత్యం చేసింది. అలా నృత్యం చేస్తూ చేస్తూ అనుకోకుండా ఒక యినపకడ్డీని తాకింది. ఎప్పుడైతే యినపకడ్డీ వంగిందో ఎలక్ట్రిక్ ప్రవాహం ఆగిపోయింది.

పై వుదంతాలనుబట్టి తేలే సారాంశం ఏమంటే—ఏ జంతువునైనా తిండిఆశ చూపెట్టి దాని తెలివితేటలు పరీక్ష చేయవచ్చు. లేదా దానికి శారీరకంగా ఏదో బాధను కల్పించి, ఆ బాధనుండి అది తప్పించుకోవటానికి ఎంత తీవ్రంగా పని చేస్తుందో దాన్నిబట్టే ఆ జంతువు తెలివితేటలు కనుక్కోవచ్చు. ఇప్పుడు యీ ఎలుకల విషయంలో జరిగినదానినిబట్టి తిండికోసం తొందరపడుతున్న మొదటి ఎలుకకంటే త్వరగా, ఎలక్ట్రిక్ షాక్ తప్పించుకోవలసివచ్చిన రెండో ఎలుక ఆ మీటలు నొక్కే పద్ధతి నేర్చుకొని ఆచరణలో పెట్టింది. (ఇంకా వుంది)

# అసలు దొంగ కృష్ణుడు కాదు

గోపాల కృష్ణుడే మాకు భర్తగా కావాలి అని గోపికలు భక్తితో దేవీపూజలు యమునా నది ఒడ్డున మార్గశిరమాసంలో చేశారు. కృష్ణుడే తమకు భర్త కావాలని కోరినటువంటి గోపికలు శ్రీ కృష్ణ పరమాత్మనే పూజ చేయవలసింది. కాత్యాయనీ దేవిని పూజ చేయడం ఎందుకు? మార్గశిరమాసం అంతా కాత్యాయనీపూజ చేసిన గోపికలు ఆఖరు రోజున చీరెలు విడిచి దిసమొలతో స్నానము చేశారు. సరదాగా జలక్రీడలు చేసే వాళ్లు దిసమొలతో సరస్సులయందు చెరువులయందు స్నానం చేస్తారు. కాని, వ్రతములు, పూజలు మొదలైనవి భక్తితో చేసేటప్పుడు బట్టలువిడిచి స్నానాలు ఆడవాళ్లుగాని, మొగవాళ్లుగాని చేయకూడదని మన ధర్మశాస్త్రములో స్పష్టంగా వ్రాసి ఉంది. ధర్మశాస్త్రానికి విరుద్ధంగా గోపికలు దిసమొలతో యమునా నదిలో స్నానాలుచేశారు. ఇది తప్పని అని వారికి తెలియ చెప్పడం కోసం వాళ్లు విడిచి ఒడ్డునపెట్టిన చీరెలను వారికి అందకుండా చేయడమైనది.

"మీచీరెలు ఎవరైనా ఎత్తుకొనిపోతే, మీరు ఏ దేవినిపూజ చేస్తున్నారో ఆ దేవినే "తల్లీ! మాచీరెలు మాకు యిప్పించు!" అని మీరు ఎందుకు ప్రార్థించడంలేదు?" అని శ్రీకృష్ణుడు ప్రశ్నవేసి వారిభక్తిలో ఉన్న లోపం వారికే తెలిసేటట్లుచేశాడు. వారి వ్రతలోపం, వారి భక్తిలోపం, వారు గ్రహించేటట్లు చేశాడు.

ద్రౌపదీదేవికి కౌరవులు నిండు సభలో చీరెవిప్పి మానభంగం చేస్తుంటే, ఆమె "హా! కృష్ణా!" అని మొఱపెట్టుకున్నది. ఎంతో దూరంలో ఉన్న శ్రీకృష్ణ పరమాత్ముడు ఆ ద్రౌపది మొరవిని, ఆమె చీరె ఎంతలాగినా అంతు లేకుండా వస్త్రా ఉండేటట్లుగా ఆమెకు అక్షయంగా వస్త్రదానం చేసి, ఆ ద్రౌపది గౌరవం శ్రీకృష్ణుడు కాపాడినాడు. అటువంటి శ్రీకృష్ణుడు గోపికలకు మానభంగం చెయ్యడానికి వాళ్ల చీరెలు ఎత్తుకొనిపోలేదు.

అసలు యీ చీరెలను కృష్ణుడు తనంతటతాను ఎత్తుకుపోనేలేదు. ఆ కృష్ణుని వెంట తిరిగే గొల్లపిల్లల గుంపు లోపు ఉండేది. ఆ పిల్లల గుంపొకటి వందమంది ఉన్నారు. వారిలో 12 మంది ఆ ముఠాకు అంతటికీ నాయకులుగా ఉండేవారు. వాళ్లు ఎవరంటే, (1) శ్రీదాముడు, (2) సుదాముడు, (3) వసుదాముడు, (4) సుబలుడు, (5) సుపార్శ్వుడు, (6) శుభాంగుడు, (7) సుందరుడు, (8) చంద్రభానుడు, (9) వీరభానుడు, (10) సూర్యభానుడు, (11) వసుభానుడు, (12) రత్నభానుడు.

గోపికల చీరెలను ఎత్తుకొని వెళ్ళినవాళ్లు యీ 12 మంది గొల్లపిల్లలే. కృష్ణుడు ఎత్తుకొనిపోనేలేదు. ఆ పిల్లలు ఆ చీరెలను ఎత్తుకొనిపోయి ఒకచోట ప్రోగుగాపెట్టిరి. వానిలో కొన్ని కృష్ణుడు తీసి ఒక పొన్నచెట్టు కొమ్మలమీద దాచి "యివిగో మీ చీరెలు ఇక్కడ భద్రంగా ఉంచాను. త్వరగా తీసికోండి" అన్నాడు ఇదీ అసలు జరిగిన సంగతి.



బొమ్మరిల్లుదగ్గిర కూర్చుని ఏదో ఆలోచిస్తున్నారు—కృష్ణాపిక్చర్సువారి "అమ్మలక్కలు"లో సుధాకర్, జేవీసరస్వతి.

# బాలతారల పరిచయం



మాస్టర్ కుందూ



బేబీ గిరిజ.

## కుందూ

"పెళ్లి చేసి చూడు"లో ప్రేక్షకులను బాగా ఆకర్షించిన పాత్రల్లో "చిట్టిబ్రీ" ఒకటి. చిట్టిబ్రీ అంటే చిచింద్రీయే. ఎవ్వరికీ హాని చెయ్యని అమాయకమైన అల్లరికీ, పెద్ద ఆరిందాలాగ ప్రతి విషయంలోనూ వేలు దూర్చటానికీ ("పెద్ద మ్యామ్. నన్నేమన్నా అనుగాని కుదరకుంక అంటే మాత్రం ఊరుకోను") పెట్టింది పేరు చిచింద్రీ. చిచింద్రీ లాంటి ముచ్చటైన పాత్రను కల్పించిన పేరు చక్రపాణి గారికీ ప్రసాద్ గారికి పోతే, దాన్ని అర్థం చేసుకుని జీవంపోసిన పేరు మాస్టర్ కుందూకు దక్కుతుంది.

కుందూ న్యాయపతి రాఘవరావు గారికి మేనల్లుడవుతాడు. పధ్నాలుగేళ్ల వయస్సు. కేసరీ హైస్కూల్లో అయిదో ఫారం చదువుతున్నాడు. రాఘవరావుగారే ఈ అబ్బాయిని సినిమా ప్రపంచానికి పరిచయం చేశారు. మొదట వాహినీ వారి "గుణసుందరి"లో అంజనం వేసే దృశ్యంలో నటించాడు. తరవాత "లైలామజ్నూ"లో మజ్నూ మీద మాస్టారితో శ్రీతీలు చెప్పిన కుర్రాడుగా వేశాడు. ప్రతిభా వారి "శ్రీ లక్ష్మమ్మ"లో పిచ్చమ్మ కొడుకు గాను, ప్రకాష్ వారి "దీక్ష"లో రౌడీజట్టులో 'టింటిం' గాను నటించాడు. తరవాత "పెళ్లి చేసి చూడు".

కుందూ ప్రస్తుతం విజయా వారికి పర్మనెంటు ఆర్టిస్టు. హిందీలో తీయబోతున్న "పెళ్ళి చేసి చూడు"లో కేవా రంగులో కూడా మునిగ తేలనున్నాడు.

# బాలతారల పరిచయం

విజయవాడలో "పెళ్ళిచేసి చూడు" శత దినోత్సవానికి, సేలంలో "కల్యాణం పణ్ణిపార్" ప్రారంభోత్సవానికి కుందూ రెండు వెండి కప్పులు బహుమతులుగా కొట్టేశాడు. రాయపేట లాయిడ్స్ రోడ్డులో క్రికెట్ జట్టు ఒకటి ఆర్గనైజ్ చేసి ఉషారుగా ఆడుతూ ఉంటాడు. ప్రతి ఆదివారం రేడియోలో పిల్లల ప్రోగ్రాముల్లో పాల్గొంటూ ఉంటాడు.

## గిరిజ.

"పెళ్ళిచేసి చూడు" లో మరిచిపోలేని పాత్రలు చాలా ఉన్నాయి. వాటిలో పడకకుర్చీ కర్ర లాగేసి "చిచింద్రీ"ని నడుము విరిగేట్టు పడేసిన "చిచ్చు" పాత్ర ఒకటి. ఆ వేషం వేసిన అమ్మాయి పేరు బేబీ గిరిజ. పట్టిపట్టి ఒక్కొక్క మాటనే ముద్దుముద్దుగా పలుకుతూ ఇదివరకు ఏ తెలుగు సినిమాలోను చూడనటువంటి పాత్రను నిర్వహించిన ఆపిల్ల ప్రేక్షకు లందరి హృదయాలనూ చూరగొన్నది. ఈమె మద్రాసులో చార్టర్డ్ ఇంజినీరు పి. ఆర్. కె. శాస్త్రిగారి కుమార్తె. మొన్న ఆగస్టు 30 వ తేదీనే 9 వ పుట్టినరోజు పండగ చేసుకుంది. ఒక కాన్వెంటు స్కూల్లో ఫస్టు ఫారం చదువుతోంది.

ఒకరోజున గిరిజా, వాళ్ళ క్కయ్యా యింటి ముంగిట "రింగ్" ఆడుతున్నారు. వారింటికేదో పని మీద వచ్చిన డైరెక్టరు ప్రసాద్ గారు గిరిజను చూసి "అమ్మాయ్, సినిమాల్లో వేషం వేస్తావా ?" అని అడిగారు. గిరిజ వేస్తానన్నది. "పెళ్ళిచేసి చూడు"లో బుక్ చేసుకున్నారు. ఆమె మొట్టమొదటగా ప్రేక్షకులకు పరిచయ మైనది "ప్రియురాలు" చిత్రంలో. తరవాత "పెళ్ళిచేసి చూడు" చిత్రంలో. రెండవ చిత్రంలోనే గిరిజ బాలతారఅయి కూర్చుంది. ఇప్పుడీమె ఎ. వి. ఎమ్. వారి "గర్ల్" చిత్రంలో డాన్సుచేసే పాత్ర ధరిస్తోంది. రోహిణీవారు తీస్తున్న "లెగసీ"లో చిన్నప్పటి నాయికగాను, తమిళతార రాజకుమారి తీస్తున్న ఒక చిత్రంలో కూడా చిన్నప్పటి నాయికగాను నటిస్తోంది. బొంబాయిలోని ఒక సినిమా కంపెనీ వారు "ప్రిన్సెస్" అనే చిత్రంలోకి ఈ మధ్యనే ఈమెను బుక్ చేసుకున్నారు.

గిరిజకు సిండరెల్లా, మిక్కీమౌస్ లాంటి కార్టూన్ చిత్రాలంటే బలేసరదా.


శ్రీ అంబాళ్
అఫీసరస్ నస్యము
SRI AMBAL SNUFF
1 [illegible] టిన్నులలో అన్నిచోట్ల దొరుకును.
శ్రీ అంబాళ్ అండు కంపెనీ,
అప్పాలు పెట్టై నెం. 8. మదరాసు.



చక్కనివ్రాతకు, మన్నికకు
అశోకా
కలములనే
వాడండి
అశోకా పెన్ వర్క్సు
తెనాలి



కృష్ణవేణి



మాస్టర్ మోహన.

## కృష్ణవేణి

కృష్ణవేణి అంటే ఏనాడో "సతీ అనసూయ"లో నటించి, ఈనాడు పెద్దతార, నిర్మాత అయిన కృష్ణవేణి కాదు యోగి వేమన"లో అందాలు చిందేటి జ్యోతి"గా నటించిన బేబీ కృష్ణవేణి. ఈమె తండ్రి టి లక్ష్మీ కాంతంగారు వాహినీ స్టూడియోలో పని చేస్తు న్నారు మొదటగా నాగయ్యగారి "త్యాగయ్య" లో బృంద నాట్యంలో వేషం వేసింది ఒక రోజున నాగయ్యగారు రేడియో వింటున్నారు హఠాత్తుగా ఒక అమ్మాయి కంఠం వినిపించింది ఆపాట ఆయన్ను ముగ్ధుణ్ణి చేసింది వెంటనే ఆ అమ్మాయిని తమ ఇంటికి పిలిపించారు "సినిమాల్లో వేషం వేస్తావా?" అని అడిగారు సినిమా అంటే ఏమిటీ అని అడిగింది కృష్ణవేణి ఒక ఫోటో చూపించి "ఈ మాదిరిగా నిన్ను బోలెడన్ని ఫోటోలుగా తీస్తాము వేస్తావా ?" అన్నారు "ఓ" అన్నదామె కళ్ల తిప్పుతూ వెంటనే "త్యాగయ్య" లోకి బుక్ చేశారు అప్పటి నుండి ఆమె అనేక చిత్రాల్లో నటించింది "తాసిల్దారు"లో గుమాస్తా కూతురుగా, పుల్లయ్యగారి "భక్తజనాబాయి"లో చిన్న జనాబాయిగా, "లైలామజ్నూ"లో చిన్న లైలాగా, "గుణసుందరి"లో చిన్న హేమసుందరిగా, "సంసారం"లో లక్ష్మీరాజ్యం కూతురుగా, (జెమినీవారి సంసారంలో కూడా చేసింది) ఎనస్కేవారి "పెళ్లి కూతురు"లో ఆశ్రమ బాలికగా, ఎవిఎమ్ వారి "బహార్"లో పల్లెటూరి పిల్ల మున్నిగా, "శాంతి"లో బొమ్మ పెళ్ళి సీన్‌లో కమలగా ఎన్నో వేషాలు సమర్థతతో నటించింది కాని ఈమె "వేమన"లో నటించిన జ్యోతిపాత్ర మాత్రం ప్రేక్షకులకు కలకాలం జ్ఞాపకం ఉంటుంది "చిన్నాయనా, చిన్నాయనా" అంటూ జ్యోతి చనిపోయిన దృశ్యం చూసినవారికి కన్నీళ్లు జోటజోట కారి తిరుతాయి.

ఇప్పుడీమె పీపుల్స్ ఆర్ట్ వారి "పల్లెటూరు"లో లలితగా వేస్తోంది ఈపాత్ర ఇదివరకటి వాటికంటే పెద్దదీ, కష్టమైనదీ కూడా ఆమె నటన ఎలా ఉంటుందో కొద్ది

# బాలతారల పరిచయం

రోజుల్లో మీరే చూస్తారు. ఈమె ప్రస్తుతం అజంతా వారి "వయారి భామ"లో 'లాలి'గా, అంటే ఎస్. వరలక్ష్మి చెల్లెలుగా నటిస్తున్నది.

### మోహన్

చూడగానే ఎత్తుకుని ముద్దెట్టుకోవాలన్నంత ముద్దొస్తాడు కందా మోహన్. కాని చేతి కందకుండా తుర్రున పారిపోతాడు. మైలాపూర్‌లో ప్లీడరు కందా భీమశంకరం గారబ్బాయి. ఈ నెల 4 వ తేదీనే 8 వ పుట్టిన రోజు పండగకు తన బాలస్నేహితు లందర్నీ ఆహ్వానించి వేడుకలు జరిపాడు. ఈడుకు తగ్గపొడుగు ఉండడు. కాని ఈడుకుమించిన తెలివితేటలు ప్రదర్శిస్తాడు. "బాలోద్యానవనం"లో నాలుగోక్లాసు చదువుతున్నాడు. పేరుకు నాలుగో క్లాసయినా, చదివేది మూరెడు పొడుగు, జానెడు వెడల్పూ ఉన్న ఇంగ్లీషు గ్రంథాలు. అయితే అవన్నీ బొమ్మలూ, పిల్లల కథలూ ఉండే పుస్తకాలే ననుకోండి. ఎప్పుడూ ఇంగ్లీషు పుస్తకాలు చదువుతూ ఉంటాడు గనక "బుక్ వరమ్" అని అనుకో గూడదు. "ఏమేమి ఆటలు ఆడతావు మోహన్ ?" అని అడిగితే డజను ఆటలపేర్లు గబగబ వల్లించాడు. కుంటిఆట, పట్టాట, కణ్ణాంగుచి, జుంగిల్ జిమ్, థీఫ్ అండ్ పోలీస్, కారమ్స్, పింగ్ పాంగ్, మికీ


ద్వితీయ వార్షిక కానుకలు! స్వర్ణపతకములతో...!!

**రూ 2,000**

**శ్రీ సత్యదేవ్ పజిలు నెం. 29**

**ముగింపు తేది 15-10-52**

రూ 800 రైటు—రూ 400 ఒక తప్పు—రూ 300 రెంకుతప్పుల—రూ 200 మూడు తప్పుల—రూ 150 నాలుగు తప్పుల ఆన్సర్లు పంపినవారికి ★ రూ 150 రైటు ఆన్సరు పంపిన ప్రతి పోటీదారుకూ ఒక స్వర్ణపతకము (బంగారు మెడలు) బహూకరించుటకు ప్రత్యేకించబడినవి. ★ రూ 6-0-0 పైగా విలువగల కూపన్లు పంపిన ప్రతిఒక్కరికి రూ 2-0-0 లు, ఖరీదుగల "అమూల్య పరిశ్రమలు" అను సబ్బులు, హైరాయిల్సు మున్నగు వస్తువులు తయారుచేసే విధానములుగల గ్రంథము పంపబడును.

★ కీసొల్యూషన్ హైద్రాబాదు మర్కెంటైల్ బ్యాంకిలో డిపోజిట్ చేయబడినది.

★ ప్రవేశరుసుము:— రూపాయికి 2 కూపన్లు, రూ 2-0-0 లకు 5 కూపన్లు

నిఘంటువు : శబ్దార్థచంద్రిక



## ఆధారములు

★ **అడ్డము:** 1. కొందరి యిష్టదైవము 3. జంతువులలో నొకటి 5. ఏడుదినముల కాలము 9. పూజింపదగినవాడు 11. సూర్యుడు 12. చంద్రుడు 13. దీని అలుపు ఒక్కొక్కప్పుడు చాలా అసహ్యమును కలిగిస్తుంది 14. క్షేమము 16. ఆడుది 19. సంవత్సరములలో నొకటి 20. శ్రీరాముని భార్య 21. ఈశ్వరుని కుమారుడు 22. బీదస్థితిలో యిదివస్తే విచారము కలుగక మానదు.

★ **నిలువు:**- 1. వారములలో నొకటి 2. నాట్యము 4. దేవాలయము 6. చెలిమి 7. "—తి" తెలియని బ్రాహ్మణుడు మిగిలిన జాతులకు మార్గదర్శకుడగుట కష్టము 8. నేర్పు గలవారు ప్రదర్శించే దీనినిచూచి ఆనందించనివారుండరు 10. విష్ణుపూజ చేయువాడు 12. ఆలస్యము 14. కొందరు స్త్రీలకు "బా—" మీద పాటలు పాడుట చాలా సరదా 15. ధనవంతుల నాశ్రయించి యితడు జీవిస్తూవుంటాడు 16. మన్మథుడు 17. నిర్మించువాడు 18. వేడుకొనుట.

★ **నిబంధనలు:** ఒక పేరుతో 2 కూపనులకు తక్కువ పంపరాదు. ఎన్నికూపనులైనను వ్రాసి పంపవచ్చు. లేదా 6 కానీబిళ్లు పంపిన 10 అచ్చుకూపనులు పంపుదుము. కూపనుల రుసుము మనిఆర్డరుద్వారా పంపాలి. **M. O.** రశీదు కూపనులతో కలిపి పంపాలి. ఫలితములకు 6 కానీబిళ్లలు తప్పక పంపాలి. కీసొల్యూషన్ 22-10-52 ఆంధ్రవార పత్రికలో ప్రకటించబడును. పూర్తిఫలితములు 26-10-52 నాడు పంపుదుము. ఈ పజిలులో ప్రతి పోటీదారు రైటు మొదలు 4 తప్పులవరకు గల బహుమతులలో ప్రతిదానిలో ఒకటి చొప్పున గెలువవచ్చును.

**SRI SATYA DEV & Co.,** Kachiguda, Hyderabad - Dn.



చామకూరు ఉషారాణి.

మాస్ — ఇంకా ఏమేమిటో...... మాస్టర్ మోహన్ ఇప్పటికి "తాయ్‌ఉళ్లం" "పెళ్లి చేసి చూడు" "ధర్మదేవత" "ముగ్గురు కొడుకులు" "మరదలు పెళ్లి" హిందీ, అరవ "సంసారం" చిత్రాల్లో వేషాలు వేశాడు. ప్రస్తుతం అంజలీవారి "పరదేశి," ప్రసాద్ గారి స్వంత చిత్రం, అరవం "పణక్కారి", మనోహరా వారి హిందీ, అరవం, తెలుగు "మనోహర" చిత్రాల్లో నటిస్తున్నాడు. ఏడేళ్ల ఈ మహానటుడు తన సినిమా అనుభవాలను గూర్చి చెబుతూ సీరియస్‌గా పోజు పెట్టి "నాకన్నిటికంటే ఒకటే బాగా జ్ఞాపకం ఉంది. 'మరదలు పెళ్లిలో 8 లెంప కాయలు తిన్నాను. దెబ్బలు చెళ్లున తగలగానే కళ్లంబడి నీళ్లు తిరిగి ఏడ్చాను. దాంతో చాలా బాగా యాక్టు చేశానని డైరెక్టరు మెచ్చుకున్నారు," అన్నాడు.

### ఉషారాణి

'పెళ్లి చేసి చూడు' సినిమాలో కడుపునొప్పి వచ్చినట్లుగా నటించిన మనమడికి బుద్ధిచెప్పిన అవ్వగా నటించింది యీ ఉషారాణి. చామకూర్ సత్యనారాయణ గారి కుమార్తె. కేసరి హైస్కూలులో చదువుకొంటోంది. నవయుగ వారి జ్యోతిలో వరలక్ష్మికి శిష్యురాలుగా యిప్పుడు నటిస్తోంది. ★

# పిల్లలకోసం సినిమాలు

★

మనదేశంలో పిల్లలకోసం కథలు, కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం అన్నీ ఉన్నాయి గాని అన్నిటికంటే ఎక్కువ ఆకర్షించే సినిమాకళ మాత్రం లేదు. సినిమాలంటే పిల్లలు చెవికోసుకుంటారు. కొత్తగా విడుదలైన సినిమాలకు మొదటి వారం రోజుల్లోనూ పెద్దవాళ్లకంటే ముందు ఎగబడేది పిల్లలే. తల్లినో, తండ్రినో పీడించి డబ్బు పుచ్చుకుని పాఠాలు కూడా వదిలేసి, గంటలతరబడి క్యూలో నుంచుని టిక్కెట్టు సంపాదించి సినిమా చూసివస్తారు. తల్లిదండ్రులు కూడా "పోన్లే పాపం సినిమా చూసి వస్తాడు" అని అనుమతిస్తారు. కాని పిల్లలు చూసే ఇన్ని సినిమాలూ పిల్లలకు పనికి వచ్చేవేనా, వారు చూడదగినవేనా ఆలోచించే తల్లీ తండ్రీ ఒక్కరూ లేరు. వారి దృష్టిలో ఏ సినిమా అయినా ఒకటే-ఏదో కాలక్షేపానికి బాగానే వుంటుంది గదా అని.

పాశ్చాత్య దేశాల్లో పిల్లల కోసం ప్రత్యేకంగా సినిమాలు తీస్తారు. పెద్దవాళ్లకోసం సినిమాలు తీసే కంపెనీలే పిల్లలకు మాత్రమే పనికివచ్చేవాటిని ఏడాదికి ఇన్ని అని లెక్కగా తీస్తారు. భూగోళం, సివిక్సు, ఫిజిక్సు మొదలైనవాటిని సుబోధకంగా ఉండేట్టు విద్యా

# పిల్లలకోసం సినిమాలు



విషయిక చిత్రాలు తీస్తారు. వీటిని స్కూళ్లలోను, పిల్లల క్లబ్బుల్లోనూ ప్రదర్శిస్తారు. వీటిని వ్యాపార దృష్టితో తియ్యరు. వీటిపై నష్టం వచ్చినా వారు లెక్క చెయ్యరు. మన దేశంలో ఈమాదిరి సినిమా చిత్రాలు ఇంకా ఎంతో అభివృద్ధి కావలసిఉన్నాయి.



భరణీ వారి అనన 'లైలామజ్ను'లో చిన్న లైలాగా కృష్ణవేణి.

పిల్లలకు అన్నిటికంటే కార్టూన్ చిత్రాలంటే బాగా మోజు. కార్టూన్ సినిమాలకోసం మన దేశంలో ప్రయత్నాలు జరుగుతున్నా అవేమీ జయప్రదం కాలేదు. ఈ సినిమాలు అమెరికాలో బాగా అభివృద్ధి చెందాయి. వాల్ట్ డిజ్నీ పిల్లలకోసం మిక్కీ మౌస్ సినిమా లెన్నో తీశాడు. స్నోవైట్, సిండరెలా మొదలైన జానపదకథలు తీసుకుని అద్భుతమైన చిత్రాలు సృష్టించాడు. డిజ్నీయే కాక పేరుగల ప్రతి సినిమా కంపెనీకూడా చిన్న చిన్న కార్టూన్ చిత్రాలు తీస్తుంది. ఈకళ రష్యాలో కూడా బాగా అభివృద్ధి పొందింది. ఈసప్ నీతికథలాంటివి తీసుకుని పిల్లలకు నీతిబోధకంగా ఉండేట్టు చక్కని చిత్రాలు రష్యావాళ్లు తీస్తున్నారు. ఇవన్నీ మనకు కొత్త. మన దేశంలో కార్టూన్ సినిమాలు సరేగదా మామూలు సినిమాలైనా పిల్లలు నిరభ్యంతరంగా చూడదగినవి లేవు.

పిల్లల మనస్సులు లేతమనస్సులు. బాల్యంలో ఏ అభిప్రాయాలు బలంగా ఆకర్షిస్తాయో అవే అజ్ఞాతంగా పెద్దయినతరవాత కూడా జీవితాన్ని పట్టుకుని నడిపిస్తాయి. బాల్యదశలో పెంపకం ఏ విధంగా ఉంటుందో పెద్దయినతర్వాత మనిషి ఆవిధంగా తయారవుతాడని ఒక సిద్ధాంతం ఉంది. అందుచేత బాల్యంలో సరియైన అభిప్రాయాలు, ఊహాలు కలిగించకపోతే రేపటిపౌరులు కాదగిన పిలలందరూ అవినీతి పరులవుతారంటే అతిశయోక్తి కాదు.

ఇప్పుడు వెలువడే సినిమాల్లో ఎక్కువ భాగం పిల్లలు ఏమాత్రం చూడదగినవిగా ఉండటం లేదు. ముఖ్యమంత్రి రాజగోపాలాచారి గారిలాంటి పూర్వకాలపువాళ్లు మన సినిమాలు పెద్దవాళ్లనే చెడగొట్టేటట్టుగా ఉంటున్నాయనీ, వాటిని బహిష్కరించాలనీ అంటున్నారు. అటువంటప్పుడు పిల్లల మాట చెప్పే దేముంది?

మన సినిమాల్లో అవినీతిని

#  పిల్లలకోసం సినిమాలు 

సూటిగా బోధిస్తున్నారని కాదు దీని అర్థం. ఏ దేశంలోనూ, ఏ సినిమాలోను ఎవరూ అవినీతిని సూటిగా సమర్థించ లేదు. ప్రతి సినిమాలోను ముందు అవినీతి జయిస్తుంది. చివరికి నీతి జయిస్తుంది. అయితే నీతికంటె అవినీతి అంటేనే ప్రజలకు మోజు ఉందనో ఏమో నిర్మాతలు అవినీతిని చిత్రించినంత చక్కగా నీతిని చిత్రించరు. ఒకాయన వేశ్యాలోలుడవుతాడనుకోండి, ఆయన వేశ్యతో గడిపిన సందర్భాలను ఎంతో మధురంగా, నోరూరేటట్టు చిత్రిస్తారు మన నిర్మాతలు. చివరికి ఆ వేశ్యావ్యామోహం వదిలిపోయి ఆయన పశ్చాత్తాపం పొందటం, భార్య కాళ్లమీదపడి క్షమాపణ వేడుకోవటం వగైరాలన్నీ టూకీగా తీసేస్తారు - వాటిమీద తమకే నమ్మకంలేనట్టు. సినిమా అంతా చూశాక ప్రేక్షకులకు జ్ఞాపకముండేది కథానాయకుడు పశ్చాత్తప్తుడైన విషయంకాదు; అతని వేశ్యాలోలతమాత్రమే.

ఈసమస్య మన దేశంలోకంటే అమెరికాలో ఎక్కువగా కనిపిస్తుంది. అక్కడతీసే సినిమాల్లో ఈమధ్య హింసాకాండ మరీ ఎక్కువగాఉంటోంది. ఆడవాళ్లని బలాత్కరించటాలు, హింసించటాలు లేని సినిమాలు సాధారణంగా కనిపించవు. బలాత్కరించటంలో ఎన్ని మార్గాలున్నాయో, హత్యలు చెయ్యటంలో ఎన్ని ఒడుపులున్నాయో, దొంగతనంచెయ్యటంలో ఎన్ని నేర్పులున్నాయో అమెరికన్ సినిమాలనుంచి సులభంగా నేర్చుకోవచ్చు.

ఇటువంటి సినిమాలు చూడటం వలన కలిగే అవినీతి సంస్కారం అమెరికాలో పెద్ద వాళ్లలో కంటే కుర్రవాళ్లలోనే ఎక్కువగా కనిపిస్తోందని, ముఖ్యంగా కాలేజీల్లో, స్కూళ్లలో చదువుకునే విద్యార్థులు ఈ సినిమాల మూలంగా తప్పుడు మార్గాలు తొక్కుతున్నారని జ్యాఫీ వాగ్నర్ అనే ఆయన ఇటీవల లండన్ "ట్రిబ్యూన్" లో ఒక వ్యాసంలో రాశాడు. అమెరికాలో సినిమా నిర్మాతలకు ఎటువంటి సినిమా అయినా తీసే ప్రజాస్వామిక హక్కు ఉంది గనక అక్కడ అలాంటి సినిమాలు తయారవుతాయంటే ఎబ్బెట్టుగా ఉండదు. అదే రష్యాలాంటి పోలీసు రాజ్యంలో అయితే ఫిలిం డైరెక్టర్లు ఏ కథపడితే ఆకథ సినిమా తియ్యటానికి వీల్లేదు. ప్రతికథనీ అధికారులు పరిశీలించి అది ప్రజలకు నీతిని బోధించేదిగా వుంటేనే సినిమా తియ్యటానికి ఒప్పుకుంటారు. ముఖ్యంగా పిల్లలకోసం తీసే చిత్రాలను మరీ జాగ్రత్తగా పరిశీలించి తీస్తారు. పిల్లలు భావిపౌరులు కాబట్టి వారిలో బాల్యంనుంచే సరియైన పౌరలక్షణాలు ఏర్పడేటట్లుగా కథలు నిర్మిస్తారు.

మన దేశంలోకూడా నిర్మాతలు పిల్లలకోసం సినిమాలు తీసేందుకు ప్రయత్నించాలి. ప్రతి నిర్మాత ఏడాదికొకటైనా పిల్లలకు పనికివచ్చే సినిమా తీస్తానని శపథం పడితే ఎంత బావుంటుంది! అస్తమానం పెద్దవాళ్ల గొడవలు, పనీపాటాలేని అబ్బాయిల, అమ్మాయిల ప్రేమసమస్యలు చిత్రించే బదులు ప్రతి నిర్మాతా పిల్లలకు క్రమశిక్షణ, దేశభక్తి, సేవాభావం పెంపొందించే సినిమాలు తీస్తేఎంత బావుంటుంది! ఈమధ్య ప్రతి తెలుగుసినిమాలోనూ బాలనటీనటులను నిర్మాతలు ప్రవేశపెడుతున్నారు. అయితే ఈ నటీనటులు అలంకారప్రాయంగా ఉపయోగించ బడుతున్నారే కాని సరియైన పాత్రపోషణ జరగటంలేదు. అలా కాకుండా పిల్లలతోనే, పిల్లలకోసమే చిన్న చిన్న చిత్రాలు ఎందుకుతియ్యకూడదూ? అలాతీస్తే ఆ చిత్రాలు ఎవరూ చూడరనీ, నష్టంవస్తుందనీ భయమా? అయితే ఇప్పుడు పెద్దవాళ్లకోసం తీసేసినిమాలన్నీ నష్టం పొందటంలేదనీ, లక్షలకి లక్షలు లాభాలు ఆర్జించి పెడుతున్నాయనీ నమ్మకమేనా? అలాగని వారిని గుండెలమీద చేతులువేసుకుని చెప్పమనండి. 


ఒక గంటలో యౌవ్వనము

కామస్తంభన

ధాతుపుష్టి. సంసారసుఖము నిచ్చుటలో సాటిలేనిది. నిరాశచెందిన వృద్ధులయందు శక్తి. ఉత్సాహము నిచ్చును రు 2.8.0

మదన మంజరి ఫార్మసీ

184, మైలా బజారురోడ్డు, మద్రాసు.

S. T. పట్టాని & సన్సు. పురసవాక్కం & కీల్పాకం బెజవాడ-శ్రీనివాస మెడికల్ స్టోర్సు పామ్రోడ్సు. రాజమండ్రి-రుక్మిందాస్ & కో. మెయిన్ రోడ్. నెల్లూరు-ఆర్యన్ ఫార్మసీ.



పెళ్లిఅంటే తలంబ్రాలు పోసుకోటం తప్ప ఇంకేమీ లేదని చిచింద్రీ, చిన్నాల అభిప్రాయం కొలువు తీరిన బొమ్మల సాక్షిగా ఉత్తుత్తి పెళ్లి చేసుకుంటున్నారు విజయావారు తీసిన "పెళ్లి చేసి చూడు"లో కుందూ, గిరిజ

# పిల్లలు - ఫిల్ములు "బాలన్నయ్య"

"ఏమండీ! బాలన్నయ్యగారి ఇల్లు ఇదేనా?" అంటూ బెజవాడనుంచి ఒక కుర్రాడు, "ఏమండీ! రేడియో అన్నయ్యగారు మీరేనా?" అంటూ తెనాలినుండి ఇంకొక బాలుడు, "బాలా ఎడిటర్ గారి ఇల్లు ఎక్కడండీ?" అంటూ అనకాపల్లి నుంచి ఇంకొక అబ్బాయి—ఇలాగ కనీసం వారానికి ఒక్కొక్క అబ్బాయి చొప్పున వచ్చి అడుగుతూ వుంటారు. వీళ్లు మదరాసు ఎందుకు వస్తున్నారో తెలుసా? ఫిల్ముల్లో యాక్టు చేయడానికి.

కొందరు బాలలు ఇంట్లో చెప్పకుండా ఎలాగో కొన్ని రూపాయిలు సంపాదించి మదరాసుకి వచ్చేస్తూవుంటారు. "మదరాసులో బాలన్నయ్య ఉన్నాడురా! అతనికి ఫిల్ము డైరెక్టర్లు అందర్నీ తెలుసునురా! "దీక్ష" ఫిల్ములో పిల్లలందరూ బాలానంద సంఘం పిల్లలేనట్రా! ఇంకా ఇతర ఫిల్ముల్లోని పిల్లలందరూ బాలన్నయ్య తాలూకువారేనటరా" అంటూ యీ బాలన్నయ్యకి ఒక పేరు వచ్చేసింది. అంచేత మన ఊళ్లలోని చాలామంది పిల్లలు ఫిల్ములలో యాక్టు చేయాలని బుద్ధి పుట్టి

"ఛలో మదరాసు" అంటూ ఇంట్లో చెప్పకుండా వచ్చేస్తున్నారు.

పాపం, ఇలాగు వస్తున్న పిల్లలకు ఇక్కడ అసలు సంగతులు ఏమీ తెలియవన్న మాట. నిజమే! ఫిల్ములలో యాక్టు చేయటానికి కొందరు పిల్లలకు ఇక్కడ అవకాశాలు ఉండడం నిజమే. ఆ పిల్లలు బాలన్నయ్యకి తెలిసినవారు అవడం కూడా నిజమే. కాని మన ఆంధ్ర దేశంలోని పిల్లలందరికీ ఫిల్ములలో అవకాశం దొరుకుతుందనుకోడం ఒక భ్రమ

"అన్నయ్యగారూ! నేను మా స్కూలు డ్రామాలో యాక్టు చేశానండీ, నేను పాడతాను కూడాను. నన్ను ఫిల్ముల్లో ఎలాగేనా చేర్పించండీ" అంటాడు ఒకడు. తమ్ముళ్లూ! స్కూలు డ్రామాలు వేరు, ఫిల్ము నటన వేరు. స్టేజిమీద పాడడం వేరు. సినిమాలో పాడడం వేరు. ఒక నాటకానికి ఒక వారం రోజులు రిహార్సిల్సు వేసి ఒక సాయంత్రం ప్రదర్శించవచ్చును. అక్కడితో ఆపని సరి. ఫిల్ములో అలాకాదు. ఒకమాట తియ్యాలంటే ఒక గంట పడుతుంది. ఒక పాట తియ్యాలంటే, దానికి రిహార్సిల్లు 15 రోజులు, రికార్డుచేయడం ఒకరోజు, దానిని ఫిల్ముతీయడం ఇంకా రెండురోజులు ఇలాగున ఎన్నో నెలలు కష్టపడితేనేగాని ఒక ఫిల్ము పూర్తికాదు.

ఫిల్ములలో పిల్లలు కొందరు యాక్టు చేస్తున్నారంటే వాళ్లందరూ చాలామంది మదరాసులో కాపురం వున్నవారే. మీకు పరిచయమైన బాల తారల పేర్లు గురించి చూడండి. 1. బేబీ కృష్ణవేణి. ఈ అమ్మాయి తల్లిదండ్రులు ఈ వూళ్ళోనివారే. కృష్ణవేణి మొట్టమొదట పిల్లల రేడియో ప్రోగ్రాంలకు వచ్చి పాడుతూ ఉండేది. ఆ పాటవిని ఫిల్ముడైరెక్టర్లు ఆ అమ్మాయిని 'వేమన'లో బుక్కు చేశారు. 2. బేబీ మల్లిక, సుమిత్ర. వీళ్లదికూడా మదరాసే. రేడియో బాలానందం ప్రోగ్రాంకి వచ్చేవారు. 'పల్లెటూరుపిల్ల'లోను, 'రత్నమాల'లోను మొదట యాక్టు చేసి పేరు సంపాదించారు. 3. టేకుమళ్ల జానకి, కృష్ణకుమారి; వీళ్లు కూడా మదరాసుకివచ్చి రేడియో

(63-వ పేజీ చూడండి)



బొమ్మల కొలువుపేర్చి బాలపేరంటాళ్లకి వాయనమిస్తోంది చిన్నమ్మ. జెమినీవారి "చిన్నమ్మ కథ"లో దువ్వూరి అన్నపూర్ణ.

గిరజ, కుందూ మోహన్ కృష్ణవేణి
ఫోటోలు తీసినది శ్రీ జి ఎన్ భూషణ్

# మన ప్రపంచం

## పండిట్ జవహర్లాల్ నెహ్రూ



"పిల్లలతో కలిసిమెలిసి తిరగడం వాళ్ళతో మాట్లాడ్డం అంటే నాకు చాలా ఇష్టం. మీతో ఆడుతూ పాడుతూ ఉండడం మరీ ఇష్టం. మీతో ఉన్నప్పుడు నేను ముసలివాణ్ణనే మాట మరిచిపోతాను. నాకు పసితనం వొదిలి చాల కాలమైపోయిందన్న మాటే మర్చిపోతాను. కాని మీకోసం ఏవైనా వ్రాయాలని కూర్చున్నప్పుడు మీకూ నాకూ మధ్య వయస్సు తెచ్చిన అంతరం మరిచిపోలేను. పిల్లలకి బుద్ధులు గరపడం పెద్దవాళ్ల కొక అలవాటు, చాదస్తం. నా చిన్నతనంలో ఇలా బుద్ధులు గరిపేవాళ్ళను చూస్తే నాకు ఒళ్ళు మండుకొచ్చేది, అలాగే నేనిప్పుడేదైనా మంచి సలహా చెప్పబోతే మీకూ కోపం రావచ్చు. పెద్దవాళ్ళకి ఇంకో అలవాటుంది. తాము చాలా తెలివైనవాళ్ళుగా కనపడాలని పోజులిస్తారు-నిజంగా ఈ తెలివి అట్టే మందికి ఉండదు. మనలో మనమాట - అసలు నాకు తెలివి ఉందో లేదో ఇంతవరకూ నాకే తెలలేదు. అప్పుడప్పుడు కొందరు మాట్లాడుతున్నది వింటే, నేనే చాలా గొప్పవాడిననీ, చాల తెలివైనవాడిననీ అనిపిస్తుంది. కాని

పండిట్ నెహ్రూ, మనమల్లు సంజయ గాంధీ, రాజీవ గాంధి, కుమార్తె ఇందిరా గాంధీ,



రంగుల రాటంమీద నెహ్రూ

**1950 ఫిబ్రవరిలో న్యూఢిల్లీ వై. డబ్ల్యు. సి. ఎ. వారి పుష్పాల ప్రదర్శనాన్ని ప్రధాని నెహ్రూ ప్రారంభించారు.**

మళ్ళీ నన్ను నేను చూసుకునేసరికి నాకే అనుమానం కలుగుతుంది. ఆమాట అలా వుంచండి. అసలు నిజంగా తెలివైనవాళ్లు తమ తెలివి తేటల్ని గురించి ఎప్పుడూ చెప్పకోరు; గొప్పవాళ్ళమన్నట్లు విర్రవీగుతూ తిరగరు.

"అందువల్ల నేను మీకు మంచి బుద్ధులు చెప్పదల్చుకోలేదు - అలా కావలసినంత చెప్పడానికి మీకు మేష్టర్లూ వాళ్ళూ చాలామంది ఉన్నారు. నేను గొప్పవాడినని చెప్పుకుంటూ ఊరేగను కూడా.

"ఇంక మరి నేనేం రాయను? మీరు నావద్దఉంటే, మీతో కబుర్లుచెప్తూ గడిపేవాడిని. అది నాకు చాలా ఇష్టం. మన చుట్టూ ఉన్న చక్కని ఈ ప్రపంచం గురించీ, చెట్లు, పువ్వులు, పక్షులు జంతువుల్ని గురించీ, నక్షత్రాలు, పర్వతాలు మొదలైన అద్భుత విషయాల్ని గురించీ చెప్పేవాడిని. ప్రకృతి సౌందర్యం మనల్ని ఆకర్షిస్తూ ఉంటుంది. కాని పెద్దవాళ్ళైనుకునే మేము అదేదీ చూడ్డం లేదు. ప్రకృతిని మరిచిపోయి నిత్యం మా కలహాలతోనూ, చర్చలతోనూ కాలం గడుపుతున్నాం మా ఆఫీసుల్లో నాలుగ్గోడలమధ్యా కూర్చునీ మేం చాలా గొప్పపని చేసేస్తున్నట్లు ఊహించుకుంటున్నాం.

"మీరైనా ఇలాటిపని చెయ్యకుండా చుట్టూఉన్న జీవితాన్నీ, సౌందర్యాన్నీ చూసి ఆనందిస్తారనుకుంటాను మీలో ఎవరైనా పేరు చెప్పే పువ్వుని గుర్తుపట్టగలరా? పాటనిబట్టి పక్షి పేరు కనుక్కోగలరా? పువ్వులూ పక్షుల్తో



భారత ప్రధాని నెహ్రూ 1949 జులైలో హెమిస్ బౌద్ధ విహారానికి వెళ్ళినప్పుడు పదేళ్ల బాల లామాను కలుసుకున్నారు.

స్నేహం చెయ్యడం ఎంత సులువో మీకు తెలుసా? ఆపేక్షతోనూ స్నేహంతోనూ చూడండి, మీకే తెలుస్తుంది దేవతల కథలూ వేదరాసి పెద్దమ్మ కథలూ మీరు చాలా వినిఉంటారు, లేదా చదివిఉంటారు. కాని విన్నవీ చదివినవీ ఈ కథలకంటె గొప్పకథ ఈ ప్రపంచానిది. అయితే ఈ గొప్పకథ చూడ్డానికి కళ్ళూ, వినడానికి చెవులూ, ఈ మనోహరమైన ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికి ఊహాపటిమా ఉండాలి." (శంకర్స్ వీక్లీనుంచి)

32 సంవత్సరముల అనుభవముగల
రెడ్డి అండ్ కో., వారి (రిజిష్టర్డు)
కుష్ఠు, బొల్లి, సుఖరోగాది
చికిత్సలకు నేడే సంప్రదించండి.
నకలు మందులు చూసి మోసపోకుడు.
అన్నిభాషలలో కేటలాగు ఉచితము.
హెడ్ ఆఫీస్: రెడ్డి అండ్ కో.,
గోపాలపురం
(తూర్పుగోదావరి)
బ్రాంచీలు - నెల్లూరు, బెజవాడ, రాజమండ్రి
సికింద్రాబాద్, విశాఖపట్నం, బరహంపురం
మొదలగు పట్టణములలో.

# ఐక్యరాజ్యసమితి 

# ★ బాలబాలికల క్షేమనిధి



ఈ చిన్న అమ్మాయికి తలనిండా పుట్టలకు పుట్టలు పేలు పడ్డాయి. నర్సులు, డి. డి. టి. అనే మందును జుట్టులోకి కొడ్తున్నారు. ఆమందు తగుల్తే పేలు చచ్చిపోతాయి.

మీకు ఎవరైనా చెప్పారో లేదో, ఈమధ్య ఒక పెద్ద యుద్ధం జరిగిందని, అందులో చాలామంది చచ్చిపోయారని. చచ్చిపోయినవాళ్లకి ఇంకా కష్టాలు ఏమి ఉంటయ్యి గనక. బతికిఉన్నవాళ్లు యుద్ధాలవల్ల తెగబాధలు పడాలి. కొందరికి కళ్లు పోతయ్యి—కొందరికి కాళ్లు పోతయ్యి—శరీరంలో ఏ భాగమైనా పోతుందికదా. తీరా మనిషిమాత్రం బతికే ఉండి, ఈ బాధలన్నీ పడాలి కొందరు. కొందరికి అమ్మ నాన్న పోతారు— చుట్టూ ఉన్న చుట్టాలందరూ చచ్చిపోయి ఒక్కడూ బతుకుతాడు. "నా" అన్నవాళ్లు, భూమి తప్ప, మరెవ్వరూ ఉండరు. అలాంటివాళ్ళగతి ఏమికావాలి. యుద్ధాలు చేసేవారు, ఈ బాధలు పడేవాళ్లను అడిగి యుద్ధాలు చెయ్యరు. కొంపలో కూర్చున్నవాళ్ళమీద, ఈ యుద్ధాలు చేసేవాళ్లు వచ్చి, బాంబులు వేసి పోతారు. ఎంత అన్యాయమో చూడండి. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క దేశంనుంచి తమకు ఇష్టం లేనివారిని వెళ్ళగొడ్తారు. అయితే ఇందులో ఏ ఒక్క పనీ పిల్లలు చేసేది కాదు. అన్నీ పెద్దవాళ్ల పనులే. ఇవి ఇలా ఉంచి, ఒక్కొక్క దేశంలో, సరైన తిండి లేక, గుడ్డ లేక, మందులు లేక, పిల్లలు నానాబాధలూ పడ్తూ ఉంటారు.

ఇలాటి పిల్లలందరికీ, చేతనైన సహాయం చేయటానికి ఒక సంఘం బయల్దేరింది. ఈ సంఘం ఎలా పుట్టిందంటే— యుద్ధం అయిపోయిన తర్వాత ప్రపంచంలో దేశాలన్నీ కలిసి, "ఐక్యరాజ్యసమితి" అనే ఒక సంఘాన్ని స్థాపించుకున్నాయి. ఇందులో, ప్రతిదేశం నుంచి ఒకరిద్దరు పెద్దవాళ్ళు ఉంటారు. వాళ్ళంతా కలిసి, అన్ని దేశాలు కలిసి మెలిసి ఉండటానికి, మళ్ళీ ఒక దేశంతో మరొక దేశం కొట్లాడకుండా ఉండటానికి (అంటే యుద్ధం చేయకుండా ఉండటానికి) ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. ఈ సంఘంవాళ్ళు 1646 సంవత్సరంలో, ప్రపంచంలో యుద్ధంవల్లగాని, జబ్బులవల్లగాని బాధపడుతుంటే పిల్లలకు సహాయం చేయటానికి "ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ బాల బాలికల క్షేమనిధి" ని పెట్టారు. నిధి అంటే డబ్బు. ఈ నిధి ఎలా వస్తుంది? ఐక్యరాజ్యసమితిలో ఉన్న దేశాలన్నీ ఈనిధికి చందా ఇస్తాయి. ఆడబ్బు పెట్టి మందులు, గుడ్డలు కొని అవసరమైన చోట్ల పిల్లలకు పంచిపెడ్తారు.

పిల్లలు ఆరోగ్యంగా ఉండాలంటే, తల్లులు కూడా ఆరోగ్యంగా ఉండాలి. ఆరోగ్యంగా ఉన్న తల్లికి, ఆరోగ్యవంతమైన పిల్లలు పుడ్తారు. కాబట్టి తల్లులకు కూడా ఈ బాలబాలికల క్షేమనిధినుంచి సహాయం చేస్తారు.

తల్లులు క్షేమంగా పురుడు పోసుకోవ

టానికి ఆసుపత్రులు కావాలి - మందులు కావాలి - మంత్రసానులు కావాలి - బలాన్నిచ్చే మందులు కావాలి-పాలు కావాలి. బీదవాళ్ళకు ఇవ్వన్నీ దొరకవు. అందుకని ఈ క్షేమనిధి సంఘంవారు, కొన్ని ఆసుపత్రులకు మందులు ఇస్తారు - పాలపొడి ఇస్తారు. మంత్రసానుల్ని తయారు చేయటానికి సహాయంచేస్తారు. మన దేశంలో తెలిసీ తెలియని మంత్రసానులు బోలెడుమంది ఉన్నారు. వాళ్లవల్ల తల్లులకు పిల్లలకు చాలా ప్రమాదాలు జరుగుతూ ఉంటాయి. అందువల్ల పురుడుపోయటం బాగా తెలిసిన మంత్రసానులను తయారు చేయటం మంచిది. పురుడుపోసే మంత్రసానులేకాక - డాక్టరు చెప్పినట్లు మందులివ్వటానికి, కట్లు కట్టటానికి నర్సులుంటారు - వీళ్ళకుకూడా చదువురావాలి. మనదేశంలో, నర్సులు తక్కువ - నర్సులకు కావలసిన చదువుచెప్పే స్కూళ్లు చాలా తక్కువ. అక్కడా అక్కడా పెద్ద పట్టణాల్లో ఉన్నయ్యి. మనదేశంలో ఆసుపత్రులూ తక్కువే. డాక్టర్లు పట్టణాల్లోనే ఎక్కువగా ఉంటారు. ఇంత దౌర్భాగ్యానికితోడు మన మందుల వర్తకులు కొందరు, మందుల్లో మన్నుకూడా కలిపి అమ్ముతూ ఉంటారు!

సరే - అదంతా అలా ఉంచండి. బాలబాలికల క్షేమనిధివారు, కొన్ని కొన్ని చోట్ల నర్సులకు శిక్షణ ఇస్తున్నారు. నజఫ్‌గడ్ అనే ఒక చోట (ఢిల్లీదగ్గిర) ఈ చదువుకుంటున్న నర్సులు చుట్టు ప్రక్కల గ్రామాలకు వెళ్లి కొందరు పిల్లలకు వైద్యంచేశారు. ఇలాగే మనదేశంలో 800 చోట్ల పిల్లలకు తల్లులకువైద్య సహాయం చేయటానికి చిన్న చిన్న ఏర్పాట్లుచేశారు. రానురాను, ఇంకా ఇంకా పెద్ద పెద్ద ఏర్పాట్లు జరగాలి. దీనితో కొన్ని బొమ్మలు వేస్తున్నాం—నర్సులు పిల్లలకు తల్లులకు ఎలా సహాయం చేస్తున్నారో, ఎలా చేయవచ్చో—ఈ బొమ్మలు కొంత వరకు తెల్పుతాయి. ★



తిరువేంద్రం శ్రీచిత్రా హోమ్‌లో బీద పిల్లలకు సంతర్పణ.


కుష్ఠు ★ బొల్లి
సుఖ, మేహ, చర్మవ్యాధులకు 35 సంగల అనుభవజ్ఞులచే తయారగుచున్న ఔషధరాజములు
టి. వి. రెడ్డి & కో., (రిజిస్టర్డ్)
గోపాలపురం తూ. గో. జిల్లా.

జలుబును భరించకండి
నివారించుకోండి!



జలుబు పట్టిందన్న చిన్న రాగానే ముక్కుపుటాల్లో కొంచెం కిపాక్ వేస్తే ముక్కు కారడం ఆగుతుంది. ఒక గంట లోపుగానే భారం అంతా తగ్గి, గుండెల మీదనుండి బరువు తీసేసినట్లుగా, మళ్లీ ఊపిరి స్వేచ్ఛగా పీల్చుకోగల్గుతారు.

కిపాక్‌లో ఉన్న మా వెలు త్వరగా ఆరిపోయే గుణంకలిగి యాంటి సెప్టిక్‌గా పనిచేస్తాయి. గుండెలు, గొంతుక పిప్పి పిలిమీద రాత్రిళ్ళు కాస్త రుద్దితే, చిర కాలంనుండి ఉన్న జలుబు కారంతూరా పోతుంది.




లిమిటెడ్.

కిపాక్
కిపాక్ పీల్చుటకు - రుద్దుటకు
ఏజెంట్లు: ఓరియంటల్ మెర్కెంటైల్ ఏజెన్సీ
99 - A, ఆర్మీనియన్ స్ట్రీటు, మద్రాసు - 1.
SISTA'S—WL—28—TEL.

# ఆటల్లో పాఠాలు

★

ఆటలాడుతూ కూచుంటే చదువురాదంటారు. నిజమే - కాని చదువుకోసం బొత్తిగా ఆటలు మానెయ్యమని చెప్పరు. పూర్వపు రోజుల్లో కంటె ఇప్పుడు స్కూళ్ళల్లో చదువుతోపాటు ఆటలెంత ముఖ్యమో గమనించారు.



ఈ అబ్బాయిలు బల్లచెక్కలు పేర్చుతున్నారు. ఈపనికి ఓపిక, జాగ్రత్త ఎంతో అవసరం. చెయ్యి ఏపాటి వొణికినా పేర్చినది కూలిపోతుంది.

నిజంగా చదువుకోసం కాని మరెందుకేనా కానీ చిన్నతనంలో ఆటలు మానెయ్యమంటే ఎవరూ మానెయ్యలేరుకూడా. ఒక వేళ జ్వరంతో బాధపడుతున్నా, నీరసంగా ఉన్నా ఏదో విధంగా ఆటలాడుతూనే వుంటారు పిల్లలైన మనిషి అన్నమూ నిద్ర ఎలా మానుకోలేడో, పిల్లలు అలా ఆటలు మానలేరు. అయితే ఆటల్లో పిల్లలు దెబ్బలాడుకోడాలు ఎప్పుడూ చూస్తూనేవుంటాం. దీనికి కారణం వ్యసనం. ఇలా వ్యసనంలేకుండా పిల్లలకి బుద్ధి కుదురుపరిచే ఆటలు మప్పినట్లయితే, అలాటి ఆటలవల్ల పిల్లలు పాడైపోరు, తగువులురావు. అసూయ, పెంకితనం, చిలిపితనం క్రమంగాతగ్గి ఆటలధోరణి ఆడుకునే పిల్లలందరికీ ఉల్లాసం కల్గిస్తాయి.

పిల్లలబుద్ధి వికాసానికి సహాయపడే ఇటువంటి ఆటలు నేర్పుతూ చదువుచెప్పే బళ్లు యూరప్ అమెరికాలలో చాలా వున్నాయట. ఇటువంటి బళ్లు మన దేశంలోకూడా అక్కడా అక్కడా వున్నాయి. చెన్నపట్నంలో బాలోద్యాన వన పాఠశాల అటువంటి పాఠశాలల్లో ఒకటి. ఈ పాఠశాలలో ఆటలసహాయంతో పిల్లలకి పాఠాలూ చేతిపనులూ చెప్పే పద్ధతి ఈ పక్క బొమ్మలవల్ల తెలుస్తుంది



ఈ అమ్మాయిలు రంగురంగుల గింజల్ని ముచ్చటగా పేరుస్తున్నారు ఇలా పేర్చడానికూడా ఓపిక ఉండాలి. రంగుల్ని ఏవిధంగా మార్చి పేర్చుకోవాలో ఆ అందచందాలు ఆడపిల్లలకు చక్కగా తెలుస్తుంది

## ఆటల్లో పాఠాలు

ఈ బొమ్మల్నిబట్టి ఇలాంటి పాఠశాలలకి వెళ్ల లేనిపిల్లలు, ఇంటి వద్దనే ఈమాదిరిగా ఆడుకోడానికి ఏర్పాటుచేసుకోవచ్చును. తల్లిదండ్రులుకూడా శ్రద్ధ తీసుకుని ఈవిధంగా ఏర్పాటుచేస్తే పిల్లలబుద్ధి వికాసానికి తోడ్పడిన వారౌతారు. పిల్లల ఆటలు పెద్దలకు చిరాకు కలిగించేవికాకుండా ఉల్లాసంకలిగించేవిగా ఉండాలి; పిల్లలకు విసుగు పుట్టించక ఉత్సాహం కలిగించాలి; వ్యసనానికి దారి తీసేవి కాక పిల్లలకు ఏకాగ్రత నియమ వర్తనలలవరించాలి.

## పిల్లలు - ఫిల్ములు

(57-వ పేజీ తరువాయి)

ప్రోగ్రాంలలో పాల్గొన్న తరువాతనే ఫిల్ములలో ప్రవేశించారు. 4. మాస్టర్ కుటుదు: ఈ అబ్బాయి సంరక్షకులదికూడా మదరాసే. రేడియో ప్రోగ్రాంల ద్వారా పేరు తెచ్చుకుని బాల హాస్యనటుడుగా పైకి వచ్చాడు. 5. మాస్టర్ మధు. ఈ అబ్బాయి రోహిణీ పిక్చర్సువారి అబ్బాయే గనుక ఫిల్ములలో ప్రవేశానికి వేరే ప్రయత్నం అవసరం లేదు. ఇంకా బేబి గిరిజ, కుమారి కల్యాణం, కుమారి అన్నపూర్ణ, మాస్టర్ కందా మోహన్, మాస్టర్ విజయశంకర్, మాస్టర్ లక్ష్మణ, శ్లేబాక్ రామకృష్ణ—మొదలైన బాలనటీనటబృందములోని వారందరూ మదరాసు పట్టణంలో ఉన్నవాళ్లే! మాస్టర్ సుధాకర్ (బేబీ) కాకినాడనుంచి వచ్చినా, మదరాసులో కుటుంబంతోసహా కాపురం ఉండిపోయాడు. రామగోపాల్ కూడా అంతే. వీళ్లందరూ బడి చదువులు మానకుండా తీరిక సమయాల్లో ఫిల్ములలో నటిస్తున్నారు.

పిల్లలు ఫిల్ములలో యాక్టు చేయటం చాలా కష్టమైన పని. ఎంతో ఓపిక ఉండాలి. మంచి ఆరోగ్యం ఉండాలి. అవసరం వస్తే బడి చదువు మానేయాలి. ఇంతా కష్టపడితే ప్రతిఫలం? ఏ కొద్దిమంది ప్రొడ్యూసర్లో తప్ప మిగిలిన కంపెనీలవారు పిల్లల్ని బాగా ఉపయోగించుకొని, వారికి దసరా కూలి డబ్బులైనా ముట్టచెప్పరు!

ఈ దసరా పిల్లల సంచికలో కొందరు బాల తారలగురించి వుంటుంది. వాళ్ల బొమ్మలుకూడా పడతాయి. అవిచూస్తే మీకు కూడా మదరాసువచ్చి వాళ్లలాగ యాక్టుచేయాలని బుద్ధిపుడుతుంది. మీలో కొందరు మీఅమ్మ పెట్టెలోని రూపాయలుతీసి ఎవరికీనూ చెప్పకుండా మదరాసు రాగలరు! అలాగున మదరాసు వచ్చేపిల్లలు తిరిగి మీవూరు [illegible] డబ్బులుకూడా [illegible]!




## క్రొత్త ప్రచురణలు

### హిగ్గిన్‌బాదమ్సు లిమిటెడ్, మద్రాసు.

భావోద్రేకాన్ని కల్గించే నూతన శైలితో తక్కువ ధరలకు బహుళ ఆకర్షణీయంగాను, సౌష్ఠవంలో అసమానంగాను హిగ్గిన్ బాదమ్స్ లిమిటెడ్ వారిచే దేశభాషలలో వెలువడిన కొన్ని క్రొత్త ప్రచురణలను క్రిందకనబరచియున్నది. వ్యాపారస్తులకు 33-1/3% కమీషను ఇవ్వబడును. వలయువారు వెంటనే పై విలాసమునకు తెలుపుదురు గాక.

| | | రు. అ. పై. |
|---|---|---|
| 1. | [illegible] సింహావలోకనం : రచయిత. జాన్ గంథర్. | 0 12 0 |
| 2. | అమెరికా : రచయిత స్టీఫెన్ విన్సెంట్ బెనే ... | 0 12 0 |
| 3 | వర్గరహిత సమాజం : ఫ్రెడెరిక్ మార్టిన్ [illegible] ... | 0 12 0 |
| 4. | శాంతిని సాధించగలము : ఫ్రాంక్ జి. [illegible] ... | 0 12 0 |
| 5. | అందరూ ఒక్క ఇంటివారే : ఎలియనార్ రూజ్వెల్ట్. | 0 12 0 |
| 6. | నూతన మహా తీర ప్రణాళిక : [illegible] ... | 0 12 0 |
| 7 | ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలు. [illegible] ... | 0 12 0 |
| 8. | రష్యా : ఎడ్మండ్ స్టీవెన్స్ ... .. ... | 0 12 0 |
| 9. | ఆగ్రహం, అనుగ్రహం : రాబర్ట్ [illegible] ... | 0 12 0 |
| 10 | బ్రతికి బయటపడ్డవాడు : అలెగ్జాండర్ బార్మైన్ ... | 0 12 0 |
| 11. | ప్రజా ప్రభుత్వం ... ... ... ... | 0 4 0 |
| 12. | చతుస్సూత్ర కార్యక్రమం ... ... ... | 0 2 0 |
| 13. | నీగ్రో .... .. ... ... ... | 0 2 0 |
| 14. | అమెరికా [illegible] ... ... ... | 0 2 0 |
| 15. | కర్షక పురోగతి . ... ... ... | 0 2 0 |
| 16. | మంచి [illegible] మంచి ఆరోగ్యం ... ... | 0 2 0 |

# గాలిదెయ్యం

(14-వ పేజీ తరువాయి)

దుతూందనుకొని", "ఆహా! నా ఫ్రెండు రామ్మూర్తి అని చెప్పి, నన్నే మోసం చెయ్యాలనుకున్నావ్. ఉండు అయితే నిన్నేమి చేస్తానో!" అని యింకా గట్టిగా కొట్టసాగాడు. వెంకటేశ్వర్లు కొట్టడం, రామ్మూర్తి అరవడం మేడంతా ఒకే గోలతో నిండింది.

కొంచెం సేపటికి ఇది విన్న, వెంకటేశ్వర్ల యింటివాళ్లు, చుట్టుపట్ల యిండ్లవారు కర్రలు తీసుకొని మేడమీదికి వచ్చి, జరుగుతూన్న దృశ్యాన్ని చూచారు. వాళ్లు రామ్మూర్తి, వెంకటేశ్వర్లతో అనేమాటలు అంటే "ఒరేయ్! నేను నీ ఫ్రెండునిరా! దెయ్యాన్ని కాదురా." అనే మాటలను విని వెంకటేశ్వర్లుతో "ఒరేయ్! అబ్బాయ్! కొంతసేపు ఆగు. చూద్దాం. అది నిజంగా దెయ్యమో, కాదో?" అన్నారు. సరే నని వెంకటేశ్వర్లు కొట్టడం నిలిపేటప్పటికి ఒళ్లంతా వాపులతో, నిట్టూర్పులు విడుస్తూ పైకి లేచాడు రామ్మూర్తి. అక్కడున్న వారందరు దుడ్డుకర్రలు పట్టుకొని "ఏయ్! నిజం చెప్పు. నీవు నిజమైన రామ్మూర్తివేనా? లేకపోతే రామ్మూర్తి వేషంలో నున్న గాలి దెయ్యమా?" అన్నారు. అప్పుడు రామ్మూర్తి ఎంతో బాధతో "అయ్యో! నేను నిజంగా రామ్మూర్తిని కాని దెయ్యాన్ని కాను." అని మొదలునుంచి, అప్పటివరకు జరిగిన కథంతా చెప్పాడు. అంతా విన్న ఆ జనులు నిజం తెలుసుకొని, జరిగిన తమాషాకు నవ్వుకుంటూ వెళ్లారు. వెంకటేశ్వర్లకు కూడా ఒకప్రక్క నవ్వు, ఇంకొకపక్క తన ఫ్రెండు తాను కొట్టిన దెబ్బలకు బాధపడ్తున్నాడే! అని విచారం ఒక్కమారుగా పట్టుకొచ్చినాయ్! అటు పిమ్మట వెంకటేశ్వర్లతో వాళ్ళ తల్లితండ్రులు తమ యింట్లో వుండే టించర్‌ను, తీసుకవచ్చి రామ్మూర్తి గాయాలకు పూయమన్నారు. వెంకటేశ్వర్లు అలాగే చేశాడు. రామ్మూర్తికి కొంత బాధ తగ్గింది. వెంటనే వెంకటేశ్వర్లు, వాడి తలితండ్రులు, రామ్మూర్తి అందరు క్రిందకెళ్లారు. పడుకోడానికి ఎల్లాగో ఆ దినం రాత్రి గడిచింది.

మఱునటి దినం లేచి ఫ్రెండ్సు యిద్దరూ ఒకరికొకరు తాము చేసిన కథంతా చెప్పుకొని, పొట్ట లుబ్బేటట్లు నవ్వుకొనసాగారు. అంతే కాదు. తాము చేసిన ఘనకార్యాలను స్కూల్లో, తోడి సోదరులకందఱికీ, ఒక కథగా చెప్పి, అందరితోబాటు తామూ నవ్వసాగారు. నాటినుండి రామ్మూర్తి స్నేహితులందరు "ఏయ్! నిజం చెప్పు. నీవు నిజమైన రామ్మూర్తివేనా? లేకపోతే రామ్మూర్తి వేషంలో నున్న గాలిదెయ్యానివా? నిజం చెప్పు". అని ఎగతాళిచేసి నవ్వేవారు.

సోదరులూ! చూశారూ! మన వెంకటేశ్వర్లు ఎంత ధైర్యవంతుడో. కాబట్టి మనం కూడా అంత ధైర్యముగా వుండాలి. "ధైర్యమే దొడ్డ" అనే నీతిని మఱచిపోకండేం. ★



కోతి ఆట

చి॥ బృందావన్; (15 సం॥) పార్వతీపురం

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras.

Rgd No M 44[illegible]9

వస్తూంది !!

అజంతా వారి...

# వయ్యారి భామ

యస్. వరలక్ష్మి, సులోచన, నాగేశ్వరరావు సి. యస్. ఆర్. వంగర

డైరెక్టర్... పి. సుబ్బారావు

...నిర్మాతలు...

యస్. లక్ష్మినారాయణ, పి.సుబ్బారావు



* ఆంధ్ర : అజంతా ఫిలిమ్స్, విజయవాడ. * సీడెడ్ : వసంతా పిక్చర్స్, గుంటకల్.
* నైజాం : సుందర్ పిక్చర్స్ సర్క్యూట్, సికింద్రాబాద్. * మైసూరు : విజయా టాకీ డిస్ట్రిబ్యూటర్స్, బెంగుళూరు.

ఇతర వివరములకు : అజంతా పిక్చర్స్ — మద్రాసు 20.